గ్రామసేవా గ్రంథమాల : ౩౫

# కూరదినుసులు

# కూరదినుసులు



కర్త

గోపేటి జోగిరాజు

పరిష్కర్త

డాక్టరు బ్రహ్మాండం నరసింహం

ప్రకాశకులు

ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు

విజయవాడ-6

# ప్రకాశకుల విజ్ఞప్తి

గ్రామసేవా గ్రంథమాలలో ఇది 35 వ పుస్తకము. ఇది దీని 3 వ కూర్పు, దీని తొలి ముద్రణమును 1945 లో గ్రంథకర్త స్వయముగ ప్రచురించినారు. మలి ముద్రణము 1968 లో వెలువడినది. ఇది మా గ్రంథమాలలో ౨౦ వ గ్రంథముగా వెలువరింపబడినది. దీని సవరణ జరిగి సంవత్సరమునకు పైగా గడచినది. వసరులు కుదరక దీని ప్రచురణలో కొంత విలంబన జరిగినది.

మన ఆహారములో కూరదినుసులు ప్రముఖ స్థానమును వహించు చున్నవి. ఇవి మన జీవితంలో నిత్యావసర వస్తువులుగా ఏర్పడినవి. అందుచేత వీనిని మనమెక్కువగా ఉత్పత్తి చేయవలసియున్నది. దీని కుపకరించు శాస్త్రీయాంశములు, అనుభవసిద్ధములగు విషయములు ఈ గ్రంథములో ఇవ్వబడినవి. స్వోపయోగమునకేగాక, వ్యాపారమునకు కూడ వీనిని పండించువారి కనుకూలించు సూచనలీగ్రంథములో కొల్లలుగా నున్నవి. ఒక్కొక్క కూరదినుసు నుత్పత్తిచేయుటకు వలయు సాగు వివరములతోపాటు, వాని వస్తుగుణములు, పాకవిశేషములు దీనిలో వర్ణింపబడినవి. కూరదినుసులకు పట్టుచీడలు, వీని నివారణోపాయములు వివరింపబడినవి. ఒక్కొక్క రకమునుగూర్చి వర్ణించుటతోపాటు, వీనిలో ప్రధానమైనవాని చిత్రములు సహితము చేర్చబడినవి. వ్యవసాయశాస్త్ర ములో డాక్టరు పట్టమును గడించిన ఉద్ధండపండితులు దీనిని ప్రస్తుతానికి సరిపడురీతిని సవరించి మాకిచ్చినారు. అందుచేత నీ గ్రంథము సమగ్ర ముగా రూపొందినది. ఇప్పుడు ఆంధ్ర రైతాంగము, తమ తమ పెరడు లలో కూరదినుసులను పండించుకొను గృహస్థులు దీనిని చదువుకొని, విషయమును గ్రహించి ఉపయోగించుకొనుట కవకాశమేర్పడినది.

## కృతజ్ఞత

మూల గ్రంథకర్త కర్షకతపస్వి కీ. శే. గోటేటి జోగిరాజుగారికి మొదట మా జోహారుల నర్పించవలసియున్నది. కోరినంతనే దీనిని పరిష్కరించి మాకు త్వరలోనే అందజేసిన వ్యవసాయశాస్త్ర నిష్ణాతులు డాక్టరు బ్రహ్మాండం నరసింహంగారికి మేము సదా కృతజ్ఞులము. రెండవ ముద్రణలో చేర్చుటకు తెనాలితాలూకా పెదపాలెం వాస్తవ్యులు శ్రీ పాతూరి రాధాకృష్ణమూర్తి శ్రమకోర్చి గుంటూరు, కృష్ణాజిల్లాలలోని కొన్ని గ్రామాలకేగి, అచ్చటి కూరదినుసులు పండించు రైతులను, కలుసుకొని, ఆయా పైర్ల ఆదాయ వ్యయముల వివరాలను, మరికొంత సమాచారమును సేకరించి మా కందజేసినారు. 2, 4 అనుబంధములలో వీనిని చేర్చినాము. ప్రస్తుత ముద్రణములోకూడ వీనిని యథాతథముగా ఇచ్చుచున్నాము. ఈ కార్యక్రమములో వీరికి ఆనాటి వ్యవసాయశాఖో ద్యోగి శ్రీ చుక్కపల్లి వెంకయ్య తోడుగ నుండినారు. వీరుభయుల సాయము మేము మరువజాలము.

శ్రీ జోగిరాజుగారి మరణానంతరము వారు తమ గ్రంథములలో చేర్చుటకు తయారు చేయించిన చిత్రముల బ్లాకులను పూర్తిగ మాకు స్వాధీనము చేసిన సోదరులు శ్రీ చెఱుకువాడ వేంకటరత్నము, ఎం.ఎల్.ఏ. గారు మాకు చిరస్మరణీయులు.

వ్యవసాయ శాస్త్రజ్ఞులు, వదాన్యులునగు శ్రీ కె. భూషణంగారు, వారి సోదరులు మాకు రు 6000/- రొక్కము నొసగి, వారి జననీ జన కులపేర వ్యవసాయశాస్త్రము 1, 2 సంపుటములను ఆంధ్రప్రదేశ్‌లోని 210 గ్రంథాలయాల కుచితముగా అందజేయుట కేర్పాటు చేయకున్న పక్షమున ఇంతలో నీ గ్రంథము వెలువడుట కవకాశముండెడిదిగాదు.

కేంద్రప్రభుత్వంవారి ప్రణాళికద్వారా కాగితం పంపిణీ నిమిత్తం ఏర్పాటైన స్టేట్ లెవెల్ కమిటీవారు మాకు 1 టన్ను కాగితం కోటా ఏర్పాటుచేయగా, త్వరలో దీనిని ఆంధ్రప్రదేశ్ పేపర్ మిల్స్‌వారు సప్లయిచేసినారు. దీనితో మొదట వ్యవసాయశాస్త్రము – మొదటి సంపుట మును, తదుపరి ప్రస్తుత గ్రంథమును ముద్రించుటకు అవకాశము లభించి నది. కనుక వీరందరికీ మా నమోవాకముల నందజేయవలసియున్నది. దీనిముద్రణ ఆరంభమైనపిమ్మట త్వరితముగాను, శ్రద్ధగాను ఈ కార్య మును నిర్వర్తించిన సర్వోదయప్రెస్ కార్యకర్తలు, మేనేజరు శ్రీ ఆర్. దివ్యప్రభాకర్ ఎంతయు అభినందనీయులు.

మా పుస్తకాల విడుదలకు తరచు సాయపడుచున్న ఆంధ్రప్రదేశ్ వ్యవసాయశాఖ డైరెక్టరుగారికి, వివిధ రైతుశిక్షణకేంద్రాల అధిపతు లకు, జిల్లా గ్రంథాలయ సంస్థల నిర్వాహకులకు ఎక్కువగా కృతజ్ఞతను తెలుపుకొనవలసి యున్నది. ఇకముందుకూడ వీరందరి సహకారముతో పునర్ముద్రణ కావలసియున్న గ్రంథములను సవరణచేయించి త్వరలో వెలువరించగల అవకాశముకొరకు ఎదురుచూచుచుందుము.

ఇన్ని విధములుగా యీ గ్రంథము వెలువడుటకై మాకు అను కూలములు లభింపజేసిన పరమేశ్వరునికి మా భక్తిపూర్వకమైన ప్రణా మములను సమర్పించుచున్నాము.

శ్రీ సర్వోత్తమ భవనము<br>విజయవాడ-6<br>15-8-1976

ఇట్లు విన్నవించు<br>**పాతూరి నాగభూషణం**<br>కార్యదర్శి

# మొదటికూర్పు పీఠిక

అనుభవజ్ఞులగు వ్యవసాయదారులే గాక ఏ యనుభవము నులేని గృహస్థులుకూడ తమ పెరళ్ళలో కూరదినుసులను తరచు పెంచగోరుచుందురు. కావున వీని పెంపకమును గురించి తెలుపు గ్రంథ మొకటి యావశ్యకమయి యుండు నను టకు సందేహము లేదు.

ఈ గ్రంథమున సుమారు 125 జాతుల కూరలను గురించి కొద్ది గొప్ప విపులముగ వ్రాయబడెను. వీనిని గురించి పరిశోధనలపైగాని యనుభవముపైగాని యాధార పడిన సారస్వతము చాల తక్కువ. వేరువేరు జాతులకు పరస్పర సంపర్కము గలిగించి క్రొత్తరకములను సృష్టించు విషయమున శ్రీ శొంఠి రామమూర్తి పంతులుగారు వ్యవసాయ శాఖాధికారిగ నున్నపుడు కొంత సంచలనము గలిగెను గాని ఫలితము తేలకముందే యప్పటి యుత్సాహ మంతరించెను. మేలురకముల కూరజాతుల యెన్నిక లేక సృష్టి విషయముననేమి, ఆయా జాతుల కూరదినుసుల నుత్పత్తి నధికము గావించుటకు దగిన దోహద విశేషముల విషయముననేమి శాస్త్రజ్ఞుల కృషికెంతేని యవకాశము గలదు.

పత్రికలలో నపుడపుడు ప్రచురింపబడిన వ్యాసముల నుండి ఆయా జాతుల పెంపకమును గురించిన విషయములను సాధ్యమైనంతవరకు సంగ్రహించి నా యొక్కయు, కొందరు వ్యవసాయదారుల యొక్కయు స్వానుభవముతో చేర్చి యిందు పొందు పరచితిని.

*    *    *

9-8-1945    గోటేటి జోగిరాజు

# విషయ సూచిక

## మొదటిభాగము : సామాన్యవిషయములు



## రెండవభాగము : కాయకూరలు, గింజకూరలు

# పటములపట్టిక

| సంఖ్య | వివరము | పుట |
|---|---|---|
| 1. | కూర పెరడు | 15 |
| 2. | వంగయాకు | 71 |
| 3. | వంగపూవు | 72 |
| 3. | అ. వంగరెమ్మ - పిందె, పూవుతో | 73 |
| 4. | వంకాయలు | 74 |
| 5. | సీమవంగ ఆకు, పూవు | 95 |
| 6. | సీమవంగపండు | 97 |
| 7. | మిరపరెమ్మ | 114 |
| 8. | బంగారు రాణి | 115 |
| 9. | సన్నిబ్రూక్ | ,, |
| 10. | ఏనుగదంతం | 117 |
| 11. | బెండఆకు | 120 |
| 12. | బెండకాయలు | ,, |
| 13. | గోరుచిక్కుడు ఆకు | 131 |
| 14. | గోరుచిక్కుడు కాయలు | 132 |
| 15. | మొక్కచిక్కుడు ఆకు | 136 |
| 16. | మొక్క చిక్కుడు కాయ | ,, |
| 17. | త్రైమాచిక్కుడు గింజ | 141 |
| 18. | అంచులు చీలనియాకు (బీర); | 147 |
| 18. | అ. అంచులు చీలినయాకు (కాకర) | 148 |
| 19. | మగపూవు - రక్షక పత్రములు : సంయుక్తముగ నుండునది (గుమ్మడి); విడిగానున్నది (ఆనగ) | 149 |

# సవరణల పట్టిక *

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 16 | జాతులకును | జాతులకు |
| 6 | 1 | -66) | -69) |
| 9 | 18 | వైఋతి | నైఋతి |
| 10 | 21 | సంవత్సరం | సంవత్సర |
| 14 | 15 | దుక్కి యెరువు | దుక్కి, యెరువు |
| 25 | 3 | ఈ నెల | ఈనెల |
| 2 | 8 | సల్ఫేటుమ | సల్ఫేటును |
| ,, | 23 | దుక్కిలానే | దుక్కిలోనే |
| 32 | 1 | పోసినేల | పోసి నేల |
| 38 | 20 | యుండు. | యుండును. |
| 38 | 8 | చాళ్ళగట్లు | చాళ్ళు, గట్లు |
| 41 | 24 | లంగా | లముగా |
| 50 | 8 | ( కల్లింగ్‌సాల్టు) | (స్మెల్లింగ్‌సాల్టు) |
| 51 | 10 | లో నకాల్ | లోనకాల్ |
| 56 | 2 | చూడ | కూడ |
| 58 | 16 | 8-40 | 8.40 |
| 76 | 2 | ముండు | ముండ్లు |
| 79 | 7 | నాటుటకు, | నాటుటకు. |

* చదువరులీగ్రంథమును చదువనారంభింపకముందే యీ పట్టికలో సూచించిన సవరణల నాయా పుటలందు చేసికొన ప్రార్థితులు. సామాన్య దోషములను, వత్తులు లోపించినవానిని గ్రంథ విస్తరణభీతిచే దీనిలో చేర్పలేదు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 84 | 15 | 60 ఫాస్ఫారిక్ | 60 కి.గ్రా.ల ఫాస్ఫారిక్ |
| ,, | ,, | 60 పొటాష | 60 కి.గ్రా.ల పొటాష |
| 90 | 2 | Purplc | Purple |
| 96 | | గుద్రము | గుంద్రము |
| 99 | 1 | అక్సుహర్డు | అక్సుహర్టు |
| 102 | 10 | 36 కిలోల ఫాస్ఫరసును | 36 కిలోల పొటాషును |
| 106 | 19,20 | వంగ కిచ్చిని | వంగ కిచ్చిన |
| 107 | 6 | (Prodenialitura) | (Prodenia litura) |
| ,, | 14 | దీని తలకాయ | దీనితల కాయ |
| ,, | 20 | 70 వ | 88 వ |
| 108 | 5 | తీసివేని | తీసివేసి |
| 109 | 2 | (80–81 వ | (98–99 పుటలు |
| ,, | 13 | ఊరవేసి. | ఊరవేసి |
| 125 | 7 | యొరువు | యెరువు |
| 128 | 2 | 25–45, ఆరుకు | ఆరుకు |
| 130 | 9 | పారిసామిక | పారిశ్రామిక |
| 131 | 9 | ద్వివిదా రణఫలము లు | ద్వివిదారణఫలములు |
| 132 | 19 | కృషి అను సంధాన | కృషి అనుసంధాన |
| 135 | 24 | ఆదిమిస్థానము | ఆదిమస్థానము |
| 137 | 3 | (1/4–3/8) | (1/4–3/8 అం.) |
| ,, | 16 | స్ప్రింగ్‌వెస్ | స్ప్రింగ్‌లెస్ |
| 138 | 18 | సెం.మీ.ల 50 కొక | సెం.మీ.ల కొక |
| 139 | 18 | (100 చ.మీ.లకు 60–100 కిలోల) | (100 చ.మీ.లకు) 60–100 కిలోల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 142 | 5 | ఆరుకు | (ఆరుకు) |
| 144 | 2 | ariet num) | arietinum) |
| ,, | 5 | అను భాగమున | అను గ్రంథమున |
| ,, | ,, | వ్రాయడెను. | వ్రాయబడెను. |
| ,, | 6 | చిక్కుచు | చిక్కుడు |
| ,, | 15 | S lanum | Solanum |
| ,, | 17 | క్షుదవార్తాకి | క్షుద్రవార్తాకి |
| 145 | 10 | 1.2,–2 | 1.27–2.0 |
| 148 | 1 | | 18 (అ)వ పటము |
| 157 | 2 | పయ బీరను | పయరబీరను |
| 159 | 6 | నూరి వేసియు | నూర వేసియు |
| 160 | 1 | అంతట | అంతటను |
| 168 | 1 | 3 అగ్రము | 3 అగ్రములు |
| 169 | 7 | అడు | ఆడు |
| 171 | 3 | సమ్మబడి | నమ్మబడి |
| ,, | 23 | పెద్దవియగుట | పెద్దవియగుట. |
| 172 | 17 | శీతకట్టు పెట్టిన | శీతకట్టున పెట్టిన |
| 178 | 12 | vefelable | vegetable |
| ,, | 17 | queen | queen) :– |
| ,, | 20 | (Biue | (Blue |
| 179 | 15 | మొదటియొ | మొదటియు |
| 180 | 19 | Cerigera | Cerifera |
| ,, | 20 | Cucurbıtaceae | Cucurbitaceae |
| 181 | 3 | శు ప్రదముగ | శుభప్రదముగ |
| 186 | 22 | పాళ | పాళ్ళ |
| 187 | 5 | క్కలుగావి, | ముక్కలు గావి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 187 | 5 | ఆనప నుయల | ఆనగకాయల |
| ,, | 14 | దేశము | దేశమున |
| 188 | 9 | కర్కట | కర్కటి |
| 191 | 5 | 24 వ పటము | 34 వ పటము |
| 192 | 5 | భూములలో | సేద్యపు భూములలో |
| 193 | 11 | గ్రా.ల | కి.గ్రా.ల |
| ,, | 18,19 | విత్తులలుగ | విత్తులుగ |
| 195 | 21 | Cuourbictaceae | Cucurbitaceae |
| 196 | పటములు | కుడి యెడమ తారుమారైనవి. | |
| .97 | 3 | కర కుండవచ్చును | వరకుండవచ్చును. |
| ,, | 8 | భాగములను | భాగములు |
| ,, | 24 | యుండును. | నుండును. |
| 193 | 16 | పాటినెలల | పాటినేలల |
| ,, | 19 | పొట్ట | పొట్ల |
| 198 | 23 | పాదెలన జేసి | పాదెలను జేసి |
| | | అందుబూడిద | అందు బూడిద, |
| 200 | 9 | తూనిరకు | తూనికకు |
| 201 | ,, | Gucurbitaceae | Cucurbitaceae |
| 208 | 4 | 15-60 | 45-60 |
| ,, | 20 | 39 సెం. | 30 సెం. |
| 211 | 8 | కానరాదు | కానరాలేదు. |
| ,, | 15 | అం వలన | అందువలన |
| 217 | 1 | 48 వ పటము | 43 వ పటము |
| 219 | 3 | మొలచిన వెంటనే | మొలచి కొంతవరకు |
| 221 | 14 | Momord:ca | Momordica |
| ,, | 19 | చో కు | చోట్లకు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 225 | 19 | కొంత సుమారు | సుమారు |
| 231 | 13 | 130-143 | 135-142 |
| 234 | 15 | Velvetbean | Velvet bean |
| 235 | 1 | 5 వ పటము | 53 వ పటము |
| 236 | 23 | తెరువును | యెదువును |
| 237 | 18 | నీపేరును | నీపేను |
| 239 | 3,4 | అనుప చిక్కుళ్ళను 100 చ.మీ.లకు | అనుపచిక్కుళ్ళను, పెసరచిక్కుళ్ళను 100 చ.మీ.లకు |
| 240 | 10 | చక్కుళ్ళను | చిక్కుళ్ళను |
| ,, | 14 | 1. బటానీ | 15. బటానీ |
| 245 | 16 | కూరదినుసు | కూరదినుసుగ |
| 246 | 3 | కా  గింజల | కాఫీగింజల |
| 247 | 4 | ఐసీ ఆక్బరీ | ఐసీ అక్బరీ |
| 248 | 11 | 069 | 0.69 |
| 249 | 4 | Solavam | Solanum |
| , | ,, | Solana ceae | Solanaceae |
| 250 | 13 | యుపయోగింపబడుట | యుపయోగించుట |
| 252 | 2 | bitaceao | bitaceae |
| 254, 255 | | [255 వ పుటలో దిగువనుగల ఫుట్‌నోటు 254 వ పుటలో దిగువను ఉండవలెను.] | |
| 257 | 12 | Banan | Banana |
| ,, | 15 | పండ్లగల కంటె | పండ్లుగ కంటె |
| 263 | 23 | రకములో లెనే | రకములో వలెనే |
| ,, | ,, | యలు | కాయలు |
| ,, | 24 | బూడిద యుండును | బూడిద బారి యుండును. |
| 265 | 5 | బ_సా | బత్తీసా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 267 | 23 | 17 వ పుటలో | 17,18 పుటలలో |
| 269 | 1 | బొదికి | బోదెకు |
| ,, | 15 | చెట్లు డలు | చెట్లు వడలు |
| 271 | 5,6 | కనకూలము | కనుకూలము |
| ,, | 7 | పిం | పిండి |
| ,, | 13 | తీక్షమూలము | తీక్ష్ణమూలము |
| 274 | 22 | grandifiora | grandiflora |
| 275 | 12 | Artccarpus | Artocarpus |
| ,, | 18 | పామెత | సామెత |
| 276 | 4,5 | ఎట్లు యీకూర | ఎట్లు వండినను యీకూర |
| ,, | 7 | పౌష్టిక లోనిది | పౌష్టికశక్తిలో దీనిని |
| 278 | 21 | పుట 179-180 | 179,180 పుటలలో |
| 281 | 5 | uucifera | nucifera |
| 282 | 17 | (elephantum limonia) | elephantum (limonia) |
| 285 | 8 | medisca) | medica) |
| ,, | ,, | (Citrus p.) | (Citrus Sp.) |
| ,, | 22 | ఉసిరక | ఉసిరిక |
| 286 | 9 | యుసరి | యుసిరి |
| 287 | 5 | Cicca acida phyianthus distichus) | Phyllanthus dislichus (Cicca acida) |
| ,, | 9 | యుసరికకాయ | యుసిరికకాయ |
| 289 | 15 | గలిగి యుండును. | యుండును. |
| 290 | 3 | చూరము | చూర్ణము |
| ,, | 23,24 | ప్రత్యేకము | ప్రత్యేకముగ |
| 291 | 23 | ఆమ్రతః | ఆమ్రతకః |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 295 | 2 | సి కూర (సిరికూర) సి కరై | సిదుకూర (సిరికూర), సిరికీరై |
| ,, | 9 | 1–14 | 1–1.4 |
| 296 | 17 | నారు మడిలో | నారుమడిలో |
| 297 | 2 | 0.10/ | 0.1% |
| 298 | 9 | హచ్చుగ | హెచ్చుగ |
| 299 | 2 | ందు | ఇందు |
| ,, | 8 | (Hbiscus | (Hibiscus |
| ,, | 17 | క్రిందివి కొన్నితమ్మెలు | క్రిందివికొన్ని తమ్మెలు |
| 300 | 3 | Indian or Sorel | Indian sorrel |
| ,, | 5 | (1–½ 3 | (1½–3 |
| 306 | 10 | చ కవ ర్తికూర | చక్రవర్తికూర |
| ,, | 11 | Chenopod: um | Chenopodium |
| 312 | 17 | 7 వ పటము | 71 వ పటము |
| 314 | 4 | డ్రమ్ హెడ్ | యర్లీ డ్రమ్ హెడ్ |
| ,, | 18 | srouts) | sprouts) |
| ,, | 23 | (అధమము900మీ. | (అధమము 900 మీ.) |
| 315 | 8 | దాని | దానికి |
| 316 | 13 | [1–1½ బండి] | 1–1½ బండి |
| ,, | 19 | 0.60×0. 0.45మీ | 0.60×0.45 మీ. |
| 317 | 16 | mot | moth |
| ,, | 17 | Plutolla macn-lipennis | Plutella maculipe-nnis |
| ,, | 21 | 0.1 | 0.1% |
| ,, | 22 | వాన్ లేక కార్బరిక్ న్ ని | మవాన్ లేక కార్బరిక్ ను |
| 319 | 12 | ఉల్లిపూష్పం | ఉల్లిపూవులు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 320 | 2 | ( సైజు) | (1/5 సైజు) |
| ,, | 6 | పాట్నా, రకము | పాట్నా రకము |
| 328 | 10 | 20 సెం.మీ. | 30 సెం.మీ. |
| 338 | 19 | మండగ | మండక |
| 344 | 14 | ........ | ఆ. తీగలుగ ప్రాకుజాతులు |
| 345 | 12 | rubar | rubra |
| 349 | 7 | కారాంతము | కాలాంతము |
| 353 | 3 | కనిపెట్టబడెను 16. | కనిపెట్టబడెను. |
| 356 | 11 | తీగజాతి 71. | తీగజాతి. |
| ,, | 22 | సునిషణక | సునిష్ణక |
| 358 | 5,6 | కాండనము | కాండమున |
| ,, | 24 | సంతృతమొ | సంస్కృతము |
| 363 | 18 | అడుగుం | అడుగున |
| ,, | ,, | వెనుకవ పుటలో | వెనుక పుటలలో |
| 365 | 6 | Coneinna | Concinna |
| 370 | 24 | లపోరా | లసోరా |
| 387 | 20 | rocida | racida |
| 388 | 20 | చేయవలెనని | చేయవలెనవిన |
| 389 | 14 | వేసి | వేచి |
| ,, | 16 | ,, | ,, |
| 390 | 15 | ndica | indica |
| 395 | 6 | వరునకు | వరుసలు |
| 396 | 8 | 48 | 8 |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 399 | 3 | ఐ లగడ్డ | ఐరులగడ్డ |
| 401 | 21 | బడెను. * | బడెను. |
| 407 | 2 | (Pthoimoea | (Pthorimaea |
| 413 | 4 | Tapioca | Tapisoca |
| 418 | 21 | (¼ భాగము | (¼ భాగము) |
| 421 | 13 | Ringiberaceae | Zingiberaceae |
| 423 | 14 | 2. | 2.5 |
| 436 | 17,18 | శీతకాలమునను | శీతకాలమున |
| | | భముగను | సులభముగను |
| ,, | 18 | దగినదిగల | దగినదిగ |
| 440 | 14 | మొరలగు | మొదలగు |
| 441 | 1 | పార్స్నిప్ | పార్స్నిప్ |
| 445 | 3 | పౌష్టికి | పౌష్టిక |
| ,, | 19 | antlquorum | autiqnorum |
| 447 | 20 | వచ్చునో | వచ్చెనో |
| 450 | పటముక్రింద | చిరుగడదుంప (తెల్ల-కురుచ) | |
| 254 | 20 | పణుపుల | కణుపుల |
| 457 | 21 | యుండుట | యుండుటచే |
| 458 | 3 | స్థూలకదం | స్థూల కందం |
| 460 | 12 | బెరుగనిచ్చిచో | బెరుగనిచ్చినచో |
| 467 | 11 | 0_65 | 0.65 |
| 468 | 18 | Lilaceae | Liliceae |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 470 | 16 | 96.35 | 96.34 |
| ,, | 17 | 5.38 | 5.39 |
| 472 | 5 | 02.49 | 92.49 |
| ,, | 7 | 91.16 | 91.66 |
| ,, | 9 | 0. 1 | 0.61 |
| ,, | 10 | 5. 9 | 5.29 |
| ,, | 11 | 1. 8 | 1.18 |
| ,, | 12 | బంత | బంతి |
| ,, | ,, | 1. 5 | 1.75 |
| ,, | 13 | 8.82 | 8.62 |
| ,, | 14 | 9.53 | 8.53 |
| ,, | ,, | .17 | 1.17 |
| ,, | ,, | 3.58 | 3.53 |
| 473 | 3 | 9.44 | 93.44 |
| ,, | 4 | 8.69 | 8.89 |
| ,, | 5 | 8.89 | 8.89 |
| ,, | 6 | 1. 5 | 1.95 |
| ,, | ,, | .10 | 8.10 |
| 474 | 8 | 0.004 | 0.04 |
| ,; | 11 | 94.4 | 94.44 |
| 475 | 44 | 03 | 3 |
| ,, | 19 | 128 | 1.28 |
| 476 | 4 | 1 0 | 100 |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 476 | 4 | 1.21 | 1.22 |
| 480 | 22 | .... | 12-00 |
| 481 | 6 | 3 అ.  అ. | 3 అ.×3 అ. |
| 491 | 8 | రు 1720.00 | రు 2720-00 |
| ,, | 18 | 35 | 25 |
| 494 | 16 | 8 సార్లు | 3 సార్లు |
| 495 | 14 | 62-00 | 62-50 |
| ,, | 15 | 1 0-00 | 120-00 |
| 497 | 17 | 00-00 | 400-00 |
| 502 | 18 | 19 తళ్ళు | 10 తళ్ళు |
| 505 | 6 | ఎరువుపేత  పు. | ఎరువుపేత 8 పు. |
| 508 | 10 | 20 మి  లీటరల్లి | 20 మిల్లీ లీటర్ల |
| 513 | 3 | నుడు బెట్టుట | నుడుకబెట్టుట |
| 515 | 3 | మజ్జి | మజ్జిగ |

# కూరదినుసులు

## మొదటి భాగము

## సామాన్య విషయములు

### 1. అవతారిక

ఆదికాలపు మానవుడు వన్యదశయందు పండ్లతో పాటు, అంత మనోహరము గాకపోయినను కొన్ని పచ్చి కాయలను, దుంపలనుకూడ దినుచుండెడివాడని యూహింప దగి యున్నది. మానవజాతి మర్కటజాతినుండి యుత్పన్న మయ్యెనని గదా పరిణామవాదులు చెప్పుదురు. ఆ జంతువు లిపుడు పండ్లనేగాక పచ్చికాయలు మొదలగు వానినిగూడ దినుచుండుట మనము చూచుచునే యున్నాము. పండ్లు తగి నన్ని లభింపకపోవుటచేతనే కోతులుగాని, ఆదిమదశయందలి మానవుడుగాని పచ్చికాయలు మొదలగువానిని దినుట యల వాటుచేసికొని యుండనోపు. మానవు డగ్నియొక్క యుప యోగమును కనుగొని నప్పటినుండియు నాతడు కొన్ని జాతుల గింజలను పచనము చేసికొని ప్రధానాహారముగ గైకొనుచు వానికిదోడు దుంపలను, కాయలనుగూడ కాల్చిగాని, ఉడికించి గాని తినుటకు ప్రారంభించెను. ప్రస్తుతకాలమున మానవు డిట్లగ్ని సహాయమున పచనముఁజేసి యస్లేకాని, తాలింపు వేయుట లేక చమురుతో వేచుట మొదలగు సంస్కారములను గావించికాని అన్నము, రొట్టె మొదలగు ప్రధానాహార

పదార్థములతోపాటు వ్యంజనముగ నుపయోగించు శాక పదార్థములే కూర లనిపించుకొనుచున్నవి.

పైన చెప్పినట్లు పచ్చివిగనే గాని, కూరగ వండిగాని తినుటకేగాక కొన్ని దినుసులు వివిధములగు పులుసులుగను, పచ్చళ్లుగను, ఊరుగాయలుగను తయారు చేయుటకుకూడ ఉపయోగపడుచున్నవి. కొన్ని జాతులు కూరగగాక యిట్లు తయారు చేసితినుటకే యెక్కువ ఉపయోగకరముగ నుండును. అయినను నిట్టివి కూడ కూరదినుసులుగనే వ్యవహరింపబడుచున్నవి.

సహజస్థితిలో దినుటకంతగా నాకర్షవంతముగ నుండక పోవుటచే కాచ, ఉసిరిక, వాక మొదలగు కొన్ని ఫలజాతులను కూడ పండిన వెనుకగాని, పచ్చివిగ నున్నపుడే కాని యిట్లు పచనముచేసి వివిధ సంస్కరణముల గావించి యాహారముగ గైకొందురు. పండిన వెనుక నక్కి దినవీలగు అరటి, మామిడి మొదలగు కొన్ని జాతుల పచ్చికాయలను కూడ యిట్లు తయారుచేసి తినవచ్చును. కావున కూరజాతులకును, పండ్లజాతులకును మంకడి యేర్పరచుట కష్టము.

శాకపదార్థముల వలెనే వండి గాని, వేచి గాని మసాలా దినుసులు మొదలగు వానిని చేర్చి తయారు చేసి తినబడు మాంసాదులుకూడ కొందరిచే కూరలనియే వ్యవహరింపబడుచున్నవి. కాని యీ గ్రంథమున శాకసంబంధమగు కూరదినుసులను గురించి మాత్రమే వ్రాయబడును.

ఒకానొక కాలమున మానవు డుపయోగించు కొనుచుండిన కూరదినుసులు ప్రత్యక్షముగనే లభించుచుండినను

క్రమశః నాతడు వానిని ప్రత్యేకముగ కృషిచేసి పెంచి యనుభవింపదొడగెను. కాని ఇప్పటికిని ఈ దేశమున వన్యస్థితియందు లభించు అత్తి, చిలకతోటకూర, పిల్లితేగలు మొదలగు ననేక జాతుల కాయలును, ఆకులును, దుంపలును కూరలుగ నుపయోగింపబడుచునేయున్నవి. కావున ఫర్మింగరు గారు తమ హైందవోద్యానకృషి గ్రంథమున[1] నొకచోట నీ దేశపు కూరజాతులలో చాల భాగము కూరజాతులని చెప్ప వీలులేని గడ్డి గాదములలో జేర్పదగినవనియు, విధిలేక యుపయోగింపబడు చున్నవనియు నిరసనభావముతో వ్రాసిరి. ఇట్టి వ్రాతలనే శిరసావహించు మనదేశపు విద్యావంతులకు కూడ దేశీయ కూరజాతులందు నిరసనభావమును, విదేశీయములందు గౌరవభావమును గలుగుటలో నాశ్చర్యము లేదు. కాని ఇండియాలో లభించు ఆయా జాతుల కూరదినుసుల తత్త్వపరిశోధన జరిగినకొలదిని, పాశ్చాత్త్యులచేతను, హైందవనవనాగరికులచేతను ప్రశస్తమగు కూరజాతులుగ పరిగణింపబడు గోబి, ఉరలగడ్డ, మొదలగు విదేశీయజాతులకును తోటకూర, చిరుగడదుంప మొదలగు యీ దేశపుజాతు లెంతమాత్రముతీసిపోవని తేలుచున్నది.

ప్రజాసామాన్యము- వారలు విద్యావంతులు గానిండు నిరక్షరాస్యులు గానిండు- కూరల నాహారమున నవశ్యమగు నొక ముఖ్యభాగముగగాక నాలుకను తృప్తిపరచుటకును, స్వతస్సిద్ధముగ నంతగా నాకర్షవంతముగలేని యన్నము మొదలగు చప్పిడిపదార్థముల నింపుగ నుండునట్లు జేయుటకు సహాయపడు వ్యంజనములుగను మాత్రము పరిగణించు

చున్నారు. అందుకు దగినట్లే వానితో మిర్చి మొదలగు ఘాటుగనుండు తాలింపు ద్రవ్యములను హెచ్చుగజేర్చి వాడు చున్నారు. కాని ఆహారమున వాని నిజమైన యుపయుక్త తను గ్రహించి యందుకు దగినట్లు వానిని తయారుచేసి తిను వారుగాని, ఆరోగ్యమునకు తోడ్పడు జాతులను వలయునం తగా బుచ్చుకొనువారు గాని యరుదు.

కూర దినుసులలో నీరు హెచ్చుగనుండుటచే సామాన్య ముగ వాని పౌష్టికశక్తి * అన్నము, పప్పు, పాలు మొదలగు వాని పౌష్టిక శక్తికంటె తక్కువయినను వానిలో నీ ప్రధా నాహార ద్రవ్యములలో లోటుగానుండు కొన్ని ఖనిజద్రవ్య ములును, విటమినులును మెండుగ నుండుటచే నవికూడ శరీర పోషణ కత్యావశ్యకములగు నాహార ద్రవ్యములేయని గ్రహింపదగును. అందును నోటికి హెచ్చు రుచిగానుండు దుంపజాతుల కంటెను, కాయగూరలకంటెను ఆకు కూరలే యెక్కువ విలువయినవనికూడ గ్రహింపదగును.

ఆరోగ్యముగ నుండవలెననిన, వయసువచ్చిన ప్రతి వ్యక్తియు నితరాహారముతోపాటు దినమునకు సుమారు 285 గ్రాముల (25 తులములు) కూరదినుసుల నుపయోగించవలసి యుండునని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. 285 గ్రాముల కూర దినుసులలో మూడవవంతునకు తగ్గకుండ అనగా సుమారు 115 గ్రాములు (10 తులములు) ఆకుకూరలుగ నుండవలెనని కూడ సలహానొసగుచున్నారు.

---

* దీనినే శాస్త్రజ్ఞులు ఇంధనశక్తి (Calorific value) యందురు.

ఈ లెక్కలనుబట్టి చూచిన ప్రతివ్యక్తికిని మొత్తము మీద సాలుకు 105 కిలోగ్రాముల కూరదినుసులు కావలసి యుండునని తేలును. ఇద్దఱు పిల్లల నొక వయసువచ్చిన వ్యక్తిగా లెక్కవేసినచో అట్టి వ్యక్తులు వేయిమందిగల గ్రామమున సుమారు 100 టన్నుల కూరలను పండించవలసి యుండును. ముక్కారు పంటలనుగాసి సగటున హెక్టారుకు అధనము 25 టన్నుల కూర దినుసుల నొసగునట్లు కృషిజేయ గలుగుచో నా గ్రామమున 4 హెక్టారులపై కూరగాయలను పండించవలసియుండును. ఈ వేయిమంది వ్యక్తులకు వలయు ధాన్యమును బండించుటకు సుమారు 120 హెక్టారులు కావలసియుండును. కావున తృణధాన్యములను సాగుచేయు విస్తీర్ణమున నధమము 30వ వంతు భూమిపైనైనను కూరదినుసులను బెంచవలసియుండును. ఇట్లు తమ స్వంత ఉపయోగమునకు వలయు కూరదినుసులేగాక గ్రామప్రజలు పట్టణములలోని ప్రజలకు వలయు కూరదినుసులనుగూడ చాలవరకుత్పత్తి జేయవలసియుండును.

ఇండియాలో కూరదినుసులను పండించు విస్తీర్ణము స్పష్టముగ తెలియదు. సుమారు 20 లక్షల హెక్టారులుండునని అంచనా. ఆంధ్రదేశమున 1968-69 సంవత్సరమున వేయబడిన విస్తీర్ణము 58,568 హెక్టారులు. అందు ఆంధ్ర జిల్లాలనబడు కోస్తా, రాయలసీమ ప్రాంతములలో 41,362 హెక్టారులును, తెలంగాణా ప్రాంతములో 17,206 హెక్టారులును గలదు. వేర్వేరు కూరగాయలక్రింద సాగు విస్తీర్ణములు ఈ దిగువ పట్టికలో ఇవ్వబడినవి.

వేర్వేరు కూరగాయలక్రింద సాగు విస్తీర్ణము (1965-66)
హెక్టారులలో

| | ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్రప్రదేశ్ |
|---|---|---|---|
| ఉర్లగడ్డ (బంగాళాదుంప, ఆలుగడ్డ) | 151 | 483 | 634 |
| కర్రపెండలం | 4,005 | 7 | 4,012 |
| గెనుసు (చిరుగడం) | 4,569 | 702 | 5,271 |
| ఉల్లి (ఎర్రగడ్డ) | 9,887 | 5,664 | 15,551 |
| దోస | 3,995 | 1,233 | 5,228 |
| పాదులు (బీర, పొట్ల, కాకర వగైరాలు) | 3,585 | 1,416 | 5,001 |
| బెండ | 1,634 | 702 | 2,336 |
| చిక్కుళ్ళు | 884 | 485 | 1,369 |
| వంగ | 6,830 | 1,406 | 8,236 |
| టొమాటో (సీమవంగ, రామ ములగ) | 4,435 | 4,035 | 8,470 |
| ఆకుకూరలు | 832 | 521 | 1,353 |
| కాబేజి వగైరా | 380 | 176 | 556 |
| బటాణీ | 175 | 376 | 551 |

ఆంధ్రప్రదేశ్‌లోని సుమారు 3½ కోట్ల జనాభాకు సరిపడు కూరదినుసులు పండించవలెనన్న పైన వ్రాయబడినట్లు వెయ్యిమందికి నాలుగు హెక్టారుల చొప్పున **1.4** లక్షల హెక్టారులలో తీవ్రకృషి జరుపవలసియుండును. లేదా **2.8** లక్షల

హెక్టారులలో ఒక్క కూర పంట చొప్పున తీయవలసియుండును. అనగా ఇప్పటి విస్తీర్ణమునకు సుమారు ఆరురెట్లు పెరుగవలసియుండును.

## 2. కూరజాతుల స్వభావభేదములు, వర్గీకరణము

కూర దినుసులలో సందర్భవశమున పైన పేర్కొనబడిన కాయగూరలు, ఆకుకూరలు, దుంపకూరలు అను మూడు తరగతులును ముఖ్యములయినవి. కొన్ని కాయగూరలలో కాయ యంతయు గాక గింజలుమాత్రమే ఉపయోగింపబడు చుండును. (ఉ. రాజులచిక్కుడు). కొన్ని జాతుల పూవులుగూడ (ఉ. అరటి, పూగోబి) కూరదినుసులుగ నుపయోగింపబడుచున్నవి. కొన్నిటిలో పూవులకాడలు కూర కుపయోగింపబడుచున్నవి. (ఉ. తామరతూండ్లు, అరటిదూట). కుక్కగొడుగు పుష్పించు జాతులలోనిది కాకపోయినను శిలీంధ్రపు సంతానవృద్ధికి తోడ్పడు అంగముగుటచే నీ తరగతి యందు జేరును. కొన్ని జాతుల యాకు గూరలలో వాని యాకులు మాత్రమేగాక మొక్కలందలి లేత కాండములు గూడ కూరదినుసులుగ నుపయోగింపబడుచున్నవి. (ఉ. తోటకూర, బచ్చలి). కొన్ని జాతులలో ముదిరిన కాండభాగములు గూడ కూరకుపయోగింపబడుచున్నవి. (ఉ. తోటకూర కాడ). దుంపకూరలనబడు వానిలో కొన్ని నిజమగు దుంపలు (ఉ. కంద, చేమ). కొన్ని భూమిపైనుండు కాండపు పరిణామములు (ఉ. నూలుకోలు). కొన్ని వేళ్ళయొక్క పరిణామములు (ఉ. ముల్లంగి, చిరుగడదుంప). కొన్ని భూములలోపల

నుండు ఆకు తొడిమల యడుగుభాగముల కూటమిచే నేర్పడి నవి. (ఉ. ఉల్లిపాయలు). చాల జాతులలో నేదేని యొకే భాగము మాత్ర ముపయోగార్హముగా నుండును. (ఉ. వంకాయ, కందదుంప) కొన్నిటిలో రెండు మూడు భాగము లుపయోగార్హముగ నుండవచ్చును. ఉ. తోటకూర (ఆకు, కాండము), మునగ (కాయ, ఆకు), అవిసె (కాయ, ఆకు, పూవు).

కూరజాతులలో చాలభాగము కొన్ని నెలలుమాత్రము పెరిగి ఫలించి నశించు ఏకవార్షికములు. వీనిలో కొన్ని నిలువుగ బెరుగు చిన్న మొక్కలు (ఉ. బెండ, మొక్కతోటకూర). మరికొన్ని లతలు (ఉ. చిక్కుడు, పెద్దబచ్చలి). కొన్నిజాతులు బహువార్షికములుగ నెదుగు గుల్మములు (ఉ. అరటి), లతలు (ఉ. దొండ), లేక వృక్షములు (ములగ).

కూర జాతులలో చాలభాగ మవి యొసగు దినుసుల కొరకు ప్రత్యేకముగ కృషిచేసి పెంచబడుచున్నవి. కాని ప్రధానముగ పండ్లకొరకుగాని, యితర ఫలసాయముకొరకుగాని పెంచబడు కొన్ని జాతులు కూరదినుసులనుగూడ నొసగుచున్నవి (ఉ. సీమవంగ, పనస, మామిడి), కొన్ని వన్య జాతులనుండి గూడ కూరలుగ నుపయోగింపదగు దినుసులు లభించుచున్నవి (ఉ. వాక, పొన్నగంటి).

చాల జాతులు తగినంత నీరును, ఎరువును లభించుచో వ్యవసాయార్హమగు - అనగా చౌడు లేనట్టిదియు, అంతగా నివక చేయనిదియునగు - నెట్టి నేలయందైనను పెంచ వీలగును. కొన్ని జాతులకు తేలిక నేలలును (ఉ. కూరవుచ్చ),

కొన్నింటికి కొంత జిగటగనుండు నేలలును (ఉ. కంద, చేమ) హెచ్చు అనుకూలముగ నుండును.

కూర జాతులలో కొన్ని యుష్ణమండల వాసులగుటచే తగినంత వేడియు, తేమయు లభించు వర్ష కాలమున బాగుగ పెరుగును. ఉ బెండ, బీర, కంద, పెండలము. వీనిని వర్ష కాలపు జాతులనవచ్చును. వీనిలో చాల భాగమును వేసవిలో పయరపంటగ నీరుపెట్టికూడ సాగుచేయవచ్చును. కాని యిట్లు సాగుచేయ వీలులేనివికూడ కొన్ని గలవు. ఉ. పెండలం. కొన్ని జాతులు సమశీతోష్ణమండల జాతులగుటచే నాంధ్ర దేశమందు శీతకాలమున మాత్రము బాగుగ పెరుగును. ఉ. సీమవంగ, నూలుకోలు. అందును గొన్నిటి నా కాలమున నైనను తగినంత శీతలముగ నుండుచోట్లనేగాని తక్కినచోట్ల పెంచుట చాలా కష్టము. ఉ. గోబి, పూగోబి. కొన్ని తోటకూర జాతులుకూడ శీతకాలమునందు పైరగును. ఉ. వంగ. ఇట్లు కొన్నిజాతులు మూడు కారులందును, కొన్ని రెండు కారులందు మాత్రమును కొన్ని యొకేకారున మాత్రమును సాగుచేయదగియున్నవి.

తోటకూరజాతులను సామాన్యముగ వైఋతి వర్షములు గురియ నారంభించగనే మొదలిడి వర్షములు హెచ్చగు వరకును విత్తిగాని, నాటిగాని సాగుచేయవచ్చును. వర్షము లాలస్యముగ ప్రారంభించుచోట్లగాని, స్వల్పముగ గురియుచోట్లగాని ఆగస్టు నెలలో విత్తుటయు నాటుటయు గలదు. కొన్ని తోటకూర జాతులను - ముఖ్యముగ దుంపజాతులను - వేసవి వర్షములు గురియుచోగాని నీరుపెట్టిగాని వేసవికి గొంత

ముందే విత్తుట లేక నాటుటగలదు. శీతకాలపు జాతులను సామాన్యముగ నైఋతి వర్ష కాలము ముగిసిన వెనుక - అక్టోబరు, డిసెంబరులలో విత్తదగును. నారునాటుజాతులను సుమారొకటి యొకటిన్నర నెల ముందుగనే వర్షపు దెబ్బనుండి రక్షణ చేయబడిన మళ్ళలోగాని, వెడల్పయిన మంటి పళ్ళెరములలోగాని విత్తి నారుపెంచి నైఋతి వర్షకాలము ముగిసిన వెనుక నాటవచ్చును. వేసవి లేక పయర పంటను శీతాకాలాంతము మొదలు యెండలు బాగుగ ముదురు వరకు అనగా జనవరి మొదలు మార్చివరకు విత్తి లేక నాటి సాగు చేయవచ్చును.

కొన్ని జాతుల జీవితము స్వల్ప కాలములోనే అనగా 3-4 నెలలలోనే ముగియును. ఉ. తోటకూర, మొక్కచిక్కుడు, బెండ, ఉల్లి. కొన్ని జాతులు దీర్ఘ కాలము 6-8 నెలలవరకు బెరుగుచుండును. ఉ. వంగ, గుమ్మడి, పెండలం, కంద. జీవితము స్వల్పకాలమున ముగియు జాతుల నొకదాని వెనుక నొకటిబెట్టి యొకే ప్రదేశమున నొక సంవత్సరము లోపల మూడు పంటలను దీయవచ్చును. ఉ. బెండ-మొక్కచిక్కుడు - చిరుగడం. దీర్ఘకాలపు జాతులకు వెనుక స్వల్పకాలపు పంట నొకదానిని మాత్రమే దీయపీలగును. ఉ. కంద-పయరదోస. కొన్ని సంవత్సరము పొడవునను బెరుగున వగుటచే నా సంవత్సరం మా మడిలో మరియొక పంటనుదీయుట కవకాశమే యుండదు. ఇట్టివి సామాన్యముగ బహువార్షికములుగ బెరుగునవికూడనై యుండును. ఉ. అరటి, దొండ.

ప్రత్యేకపు శ్రద్ధగాని, హెచ్చు యెరువుగాని, నీరు గాని యవసరములేక సామాన్య సస్యములవలెనె సులభముగ పెరుగునట్టియు, విస్తారము గిరాకి గలిగి యెగుమతి కాదగునవియు, లేక నిలువజేయు వీలగునవియునగు కొన్ని జాతుల కూరదినుసులు పొలములందు సామాన్య వ్యవసాయదారులచే నితర సస్యములతో పాటు విరివిగ సాగుచేయబడుచున్నవి. ఉ. వంగ, దోస, ఉల్లి, కంద. కాని కొన్నిజాతుల కూరదినుసులను పెంచుటకు గొంత ప్రత్యేకానుభవమును, నిపుణతయు, మంచినీటి వసతిగలిగిన సత్తువయయిన నేలయు నవసరమగుటచే వీనినిట్లు సామాన్య వ్యవసాయదారులు విరివిగ పెంచుట కనుకూలపడదు. కావున నీపని కొద్ది విస్తీర్ణముగల ప్రత్యేకపు మళ్ళలో కూరదినుసులను పెంచుటయే పరంపరా వృత్తిగగల కొన్ని కుటుంబముల వారిచేగాని తెగలచేగాని జయప్రదముగ నడుపబడుచున్నది. గంజాం జిల్లాలోని పొందరో వారును, ఉత్తర విశాఖపట్నపు జిల్లాలోని కూరాకుల వారును, అనకాపల్లి ప్రాంతములందును కొన్ని యితర ప్రదేశములందును గల గవర వారును, పిఠాపురం ప్రాంతములందలి శిష్టుకరణములును కూరదినుసుల సాగునందు నిపుణత గల ముఖ్య తెగలవారు. వీరును, కొన్ని జాతులను విరివిగ పైరుచేయు వ్యవసాయదారులు గూడ ఆయా దినుసులను విక్రయముకొరకే పండించుచుందురు. ఇట్లు విక్రయమునకు గాక స్వంత యుపయోగమునకు మాత్రము తమ ఇండ్ల పెరళ్ళలోను, పొలములందును కూరదినుసులను స్వల్పముగ సాగుచేయువారుకూడ ననేకులు గలరు. ఇట్లు చిన్నచిన్న

పెరళ్ళలో స్వంత యుపయోగమునకు సాగుచేయుటకును, ప్రత్యేకపు కూరపెరళ్ళలో విక్రయమునకు బెంచుటకును గూడ విస్తారము స్థలము నాక్రమించక త్వరలో పెరిగి యుపయోగమునకువచ్చు జాతులే యనుకూలములు.

ఇంతవరకు వివరింపబడిన సామాన్యపు కూరజాతుల నాయా ముఖ్య స్వభావ భేదముల ననుసరించి క్రింది విధమున వర్గీకరింపవచ్చును. ఆయా జాతుల నేయే కాలము లేక కాలములందు విత్తి లేక నాటి పెంచదగునో సూచించు కొన్ని గుర్తులు (వ=వర్ష కాలము; శీ=శీతకాలము; ప=పయరకారు - లేక వేసవికాలము) వాని పేళ్ళచివర జేర్చబడెను. నాలుగు నెలలకంటె హెచ్చుకాలము నేల నాక్రమించు జాతుల పేళ్ళచివర * గుర్తుకూడ చేర్చబడెను. సంవత్సరము పొడవునను బెరుగుచుండువాని పేళ్ళచివర § గుర్తు జేర్చబడెను.

## కూరజాతుల వర్గీకరణము

1. నిలువుగ, చిన్న మొక్కలుగ నెదుగు జాతులు.
   - అ. కాయగూరలు.
     - i. నేరుగ విత్తదగినవి:— బెండ-వ, ప; గోరుచిక్కుడు-వ, ప; మొక్కచిక్కుడు - శీ.
     - ii, నారుపోసి నాటదగినవి:— వంగ - వ, శీ, ప*; సీమవంగ - శీ*; తియ్యమిరప - శీ.*
   - ఆ. గింజకూరలు-నేరుగ విత్తదగినవి:- మొక్కచిక్కుడు-శీ.
   - ఇ. పూవుకూరలు.

i. నేరుగ విత్తదగినవి:– పుల్లగోగు – వ,శీ,ప; ఉల్లి – వ,శీ,ప.

ii. నారు పెంచి నాటదగినవి:– గోబి–శీ; ఉల్లి – ప.

ఈ. ఆకుకూరలు లేక కాడకూరలు.

i. నేరుగ విత్తదగినవి:– తోటకూర–వ, శీ; మట్టుబచ్చలి–వ, శీ, ప; చుక్కకూర–శీ; గోగు–వ, శీ, ప; మెంతి – శీ; ధనియం–శీ; లెట్యూస్ – శీ.

ii. నారు పెంచి నాటదగినవి:– గోబి – శీ.

ఉ. దుంపకూరలు.

i. నేరుగ విత్తదగినవి:– ముల్లంగి – ప, గాజర – శీ.

ii. విత్తులనుండి నారు పెంచినాటదగినవి:– నూలుకోలు–శీ: ఉల్లి – ప;

iii. దుంపలు నాటి పెంచదగినవి:– కంద – వ, ప*; చేమ–వ, ప*; చారకంద - వ, ప*; ఉల్లి - వ, శీ, ప.

II తీగ జాతులు.

అ. కాయగూరలు

i. విత్తులచే వృద్ధిచేయదగినవి:—— బీర–వ, ప; దోస – వ, ప; పొట్ల - వ, ప; కాకర - శీ, వ*; కూరపుచ్చ - ప*; ఆనప-వ, ప*; గుమ్మడి–వ, ప*; బూడిదగుమ్మడి-తొ, ప*; గోలుకొండ చిక్కుడు-వ, శీ, ప; తీగచిక్కుళ్లు (తొక్కమృదువుగనుండు రకములు)–వ*.

ii. కాండభాగము లేక దుంపలచే వృద్ధిచేయదగినవి:– తియ్యదొండ - శీ§; నేతిదొండ - తొ§; ఆగాకర-వ.

ఆ. గింజకూరలు:—— కొన్ని తీగ చిక్కుళ్లు

ఇ. పూవుగూరలు:—విత్తులుచల్లి పెంచునది తియగుమ్మడి-వ,ప.

ఈ. ఆకుగూరలు:— విత్తులచే వృద్ధిచేయదగినవి పెద్దబచ్చలి- వ*, కొయ్యతోటకూర - ప*; పుదీనా - శీ*.

ఉ. దుంపగూరలు:— పెండలం-వ*; చిరుపెండలం-వ; చిరుగడం లేక మోహనం-శీ.

III. తుప్పలు లేక చెట్లుగా నెదుగు బహువార్షికజాతులు.

అ. కాయగూరలు:— అరటి-వ, శీ, ప§, మునగ-వ§; పనస-వ§; సదాపనస-వ§.

ఆ. గింజకూరలు:— పనస-వ; సదాపనస-వ.

ఇ. పూవుకూరలు:— అరటి-వ, శీ, ప.

ఈ. ఆకుగూరలు:— అవిసె-వ, ప; కరివేప-తో.

## 3. సేద్య విధానము

సామాన్యవు పొలములం దితర సస్యములతోపాటు సాగుచేయబడు కూరజాతులను ఆ సస్యములతో పరివర్తనము జేసి వానికివలెనే దుక్కి యెరువు వేయుట మొదలగు పనులు గావింపబడుచుండును. ఈ క్రింద కొన్ని మాదిరి పరివర్తనములు జూపబడెను.

### 1. మెట్ట (వండలి) నేలలలో

| | |
|---|---|
| 1వ సం॥ | పెండలము లేక కంద (జూన్‌లో నాటి) |
| 2వ సం॥ | మెట్టవరి+కంది+ప్రత్తి (జూన్‌లో విత్తి) |
| 3వ సం॥ | మెట్టవంగ (సెప్టెంబరులో నాటి) |

### II. తోటభూములలో

| | మొదటి పంట | రెండవ పంట | మూడవ పంట |
|---|---|---|---|
| 1వ సం॥ | గంటె (రాగి) | మిరప | మిరప(వెనుకటిది) |

| | | | |
|---|---|---|---|
| 2వ సం॥ | మొక్కజొన్న + ఉల్లి | చిరుగడము | పయరచోడి |
| 3వ సం॥ | నూవు | పెద్దచోడి | నీటి వంగ |

III మాగాణి భూములలో

| | మొదటి పంట | రెండవ పంట |
|---|---|---|
| 1వ సం॥ | వరి | బీర, దోస |
| 2వ సం॥ | వరి | మినుము |
| 3వ సం॥ | బొంత అరటి | బొంత అరటి (నిలువ) |
| 4వ సం॥ | వరి | జనుము |
| 5వ సం॥ | వరి | నీటికంద లేక నీటిచేమ |

1వ పటము

| I | II | III | IV | V |
|---|---|---|---|---|
| | | ○ నూయి | | |

ఒక యెకరము విస్తీర్ణముగల కూరపెరడు

వ్యాపారమునకుగాని, ఇంటికొరకుగాని కూరగాయలు పెంచునపుడు అనవరతముగా కూరగాయలు లభింపవలె నన్నను, సక్రమమైన సేద్యవిధానములను అవలంబింపవలె నన్నను, ఒక పథకమును తయారుచేసుకొనుట మంచిది. దీనిని తయారుచేయునపు డీ క్రింది సూత్రములను గుర్తించుకొనవలెను.

1. తోటకు చుట్టును కంచె యుండవలెను.

2. కంచెకు లోపల చుట్టును మునగ, కరివేప, అవిసె, ఉసిరిక, నిమ్మ, వెలగ, కొబ్బరి, బొప్పాయి, క్రమాక్, సదాపనసవంటి కూరలనొసగు చెట్లను నాటుకొనవలెను. చిన్న పెరటి తోటలలో స్థలాభావము గనుక చెట్లను వేయుటతగదు. అట్లు వేసినచో వాటినీడబడినచోట కూరలు పైరుకావు. అట్టి చిన్న పెరటిలో ఉత్తరపు వారగా చిన్న చెట్లను వేసినచో వాటినీడ ఎక్కువకాలము స్థలమునకు వెలుపలనే పడును.

3. బహువార్షిక జాతులగు దొండ, అరటి మున్నగు వాటిని ఒక వారగా పెంచినచో మిగిలిన భాగమును కావలసినప్పుడెల్ల సేద్యము చేసికొనుటకివి అడ్డము రాకయుండును. అట్లే దీర్ఘకాల పరిమితిగల కంద, పెండలము, కర్రపెండలము వంటి పైర్లనుకూడ ఒక ప్రక్కగా వేయుట మంచిది.

4. దీర్ఘకాలపు పైర్ల వరుసలనడుమ ప్రథమదశలో స్వల్పకాలపు పైర్లను వేసి రెండు మూడు నెలలలో కోసివేసి, దీర్ఘకాలపు పైరు పెరుగుటకుమడిని విడిచిపెట్టవచ్చును. ఇట్లు నడిమిపైర్లుగా పెంచుటకు ముల్లంగి, బీటు, ఆకుకూరలు, పొట్టిచిక్కుడు, ఉల్లి మొదలగునవి తగియుండును.

5. ఒక కూరపైరును పెంచుటకు కేటాయించిన మడిలో, మడినంతటిని ఒకేరోజున నాటక, పక్షమున కొక భాగము చొప్పున నాటినచో కోతలకాలము విస్తరించును. ఇట్లు నాటుకొరకై వేచియుండు మళ్ళలో ఆకుకూరలనుగాని

స్వల్ప వ్యవధిలో కోతకువచ్చు ముల్లంగి, పొట్లచిక్కుడు వంటి పైర్లనుగాని వేయవచ్చును.

6. పంతుల ప్రకారమైనను ఏడాదికొక మడియందైన పచ్చిరొట్ట పైరును పెంచవలెను.

7. సస్యపరివర్తన సూత్రములను సాధ్యమగునంత వరకు పాటించవలెను. అనగా లోతుగవేళ్ళు వ్యాపించుపైర్ల తరువాత పైపైన వేళ్లుగలవాటిని, సారమును బాగుగ లాగెడు పైర్ల తరువాత భూసారము నంతగా పీల్చివేయని పైర్లను - అడపాతడపా పప్పు జాతి (Leguminous crops) పైర్లను వేయవలెను.

8. కూరగాయలు ఏయే ఋతువులందు పైరగునో తెలిసియుండుట ఎంతో ఆవశ్యకము. ప్రతి ఋతువునను పైరగునట్టి కూరలజాబితా తయారుచేసి పెట్టుకొనుట చాల యనుకూలము.

9. స్థలమును అనుకూలమునుబట్టి అయిదునుండి 12 లేక 16 భాగములుచేసి ప్రతి భాగమునను అవలంబింపదగు పరివర్తనమును తయారుచేసి పెట్టుకొనవలెను. ఉదాహరణకు అయిదు భాగములుగా చేసినస్థలమున ఒక్కొక్కమడియందు వేయు పైరుల జాపితా ఈ దిగువనీయబడినది. ఎవరి పరిస్థితులనుబట్టి వారు ఇట్టి పథకమును చేసిపెట్టుకొనుట మంచిది.

I వ భాగమునందు

1. తొలకరి కారున:-
2. శీత కారున:-
3. పయర కారున:-

} దొండ మొదలగు సంవత్సరము పొడుగునను బెరుగు బహువార్షిక జాతులు. కంచెయోర చుట్టును 1వ పటములో చూపబడినట్లు కొంత స్థలమును వదలుటకు వీలులేనంత

చిన్న పెరళ్ళలో అరటి మొక్కల నీ భాగ మున నావరణయోర నొక వరుసగ నాటి యావరుస ప్రక్క లోవైపున దొండ వగైరాలను నాటవలెను.

## II వ భాగమునందు

1. తోలకరి కారున:- తీగ చిక్కుడు, బీర, పొట్ల మొదలగు తీగలుగ బెరుగు కాయగూరజాతులు.

2. శీత కారున:- కొంత భాగమున వెనుకటికారున బెట్టిన తీగ చిక్కుడువంటి దీర్ఘకాలపు జాతులు నిలచి యుండును. తక్కిన భాగమున సీమవంగ, మొక్కచిక్కుడు, నూలుకోలు, గా జ ర మొదలగు శీతకాలపు జాతులను నాటదగును.

3. పయర కారున:- కొంత భాగమున వెనుకటి కారున బెట్టిన సీమవంగవంటి దీర్ఘకాలపు జాతులు నిలచి యుండును. తక్కిన భాగమున ఉల్లి, చిరు గడం మొదలగు దుంపజాతులను నాటవలెను.

## III వ భాగమునందు

1. తోలకరికారున:- నేరుగ విత్తదగు బెండ, గోరుచిక్కుడు మొదలగు నిలువుగ నెదుగు కాయగూర జాతులు.

2. శీతకారున:- నారుపోసి నాటదగు వంగ, మిర్చి మొదలగు కాయగూర జాతులు.

3. పయరకారున:- పై జాతులే నిలచియుండును.

## IV వ భాగమునందు

1. తొలకరికారునః- నారుపోసి నాటదగు వంగ మొదలగు కాయగూరజాతులు.
2. శీతకారునః- పై జాతులే నిలచియుండును.
3. పయరకారునః- నేరుగ విత్తదగు బెండ, గోరుచిక్కుడు మొదలగు కాయగూర జాతులు.

## V వ భాగమునందు

1. తొలకరికారునః- కంద, పెండలము, చేమ మొదలగు దుంప జాతులు.
2. శీతకారునః- పై జాతులే నిలచియుండును.
3. పయరకారునః- బీర, పొట్ల మొదలగు తీగలుగ పెరుగు కాయగూర జాతులు.

చిన్న పెరళ్ళలో I వ భాగమున నాటుటకు సామాన్యముగ కూర కుపయోగింపబడు బొంత యరటికి బదులు, పండుగ నుపయోగించునట్టియు కురుచగ నెదిగి పెద్ద గెలను వేయునట్టియు వామనకేళీ (Mauritius) అరటిని నాటుట యనుకూలము.

గోగు, తోటకూర మొదలగు ఆకుకూర జాతులను ఇతర జాతులతో మిశ్రణముగను, బోదెల ప్రక్కలను, గట్లమీదను నాటి పెంచవచ్చును. లేక III, IV భాగములలో వీనికి ప్రత్యేకముగ కొంత స్థలము వదలవచ్చును.

నూయియున్న భాగమున దాని సమీపమున నారుమళ్లకుగూడ కొంచెము స్థలము వదలవలెను.

నేలలు:- చాలజాతుల కూరదినుసులను తగిన కృషి చేయుచో 8,9 వ పుటలలో వ్రాయబడినట్లు పలువిధముల నేలలలో పెంచవచ్చును. కాని మిగుల జిగటిగనుండు నేలలు గాని మిక్కిలి యిసుకకొడి నేలలుగాని కూరజాతులు బాగుగ పెరుగుట కనుకూలములు గావు. సామాన్య వ్యవసాయపు భూమికంటె కూరగాయలను పెంచు నేలలు హెచ్చు సత్తువగలిగి యుండవలెను. నీరు సులభముగ వడియవలెను,

మళ్ళు:- నేలను తగినంత ముందుగ బాగుగదున్నిగాని త్రవ్విగాని సిద్ధపరుపవలెను. ఒక జాతిని తీసివేసిన పిమ్మట మరియొక జాతిని మరల విత్తుటకు కొంత వ్యవధి యుండవలెను. ఈ వ్యవధికాలము నందు మంటిని తరచు తిరగత్రవ్వి దానికి సూర్యరశ్మియు గాలియు బాగుగ తగులునట్లు చేయవలెను.

దున్నుటకు సామాన్యముగ నుపయోగింపబడు కర్ర నాగటికి బదులు ఇనుప నాగళ్ళ నుపయోగింప వచ్చును.* నేలను త్రవ్వుటకు గునపమును, పెద్ద పండ్లకోలను, గండ్ర గుద్దలిని, పారను, పెద్దగుద్దలిని, పండ్ల గుద్దలిని ఉపయోగింప వచ్చును. ♦

* వ్యవసాయశాఖవారిచే పరీక్షింపబడి కర్షకులకు సిఫారసు చేయబడుచున్న యినుప నాగళ్ళను గురించిన వివరములు ఆ శాఖవారి గ్రామస్థుల పంచాంగమునందు గాననగును.

• 'ఉద్యాన కృషి ప్రథమ పాఠములు' చూడనగును.

1. ఎరువులు:- సామాన్య సస్యముల వలెనే కూర జాతులకు కూడ పశువుల ఎరువే శ్రేష్ఠము. దీనిలోని కార్బనిక పదార్థము (సేంద్రియ పదార్థము) నేల స్వభావమును మెరుగు పరచును. ఆహార మూలకములను పట్టియుంచును. రేగడి నేలలలో మొదటి లక్షణమున్ను, ఇసుక నేలలలో రెండవలక్షణమున్ను అత్యంత ప్రయోజన కారులు. ఇసుక నేలలలో నీటిని పట్టి యుంచుటకు కూడ కార్బనిక పదార్థము ఆవశ్యము కనుక ఇసుక కొండి నేలలో పశువుల ఎరువు యొక్క ప్రాధాన్యత మరింత ఎక్కువ. సామాన్యముగ 2 1/2 సెంట్లకు (హెక్టారులో నూరవ భాగము, దీనిని 'ఆరు' అందురు.) అరబండి (షుమారు 250 కిలోలు) ఎరువు వేసినచో, ఇసుక నేలలలో ముప్పాతిక బండి వేయదగును. ఎరువును బాగుగ చీకిన పిమ్మటనే ఉపయోగించవలెను. చీకని ఎరువులు, గడ్డి మొదలగునవి నేలలోని నైట్రోజను తగ్గించి పైరుకు హాని కలిగించును.

గొర్రె పెంటికలను, మేక పెంటికలను ప్రాతగిలి వాని సారము పోకమునుపు ఉపయోగించుచో మంచిపనిచేయును. విరివిగ కూరజాతులను పెంచుచోట్ల నీ జంతువులను మంద కట్టి నేలను వెంటనే దున్ని వేయవచ్చును. లేక ముందుగ కొంత పశువుల యెరువును వేసి మొక్కలు మొలచిన లేక నాటు కొనిన తరువాత వీని పెంటికలను నలుగగొట్టి యా పొడిని పైని జల్లి గొప్పు త్రవ్వవచ్చును. వీని మూత్రముతో తడిపిన మంటిని గూడ యిట్లుపయోగింపవచ్చును. కోడిపెంటను గూడ ఎరువుగ వాడవచ్చును.

కూరగాయలను ముఖ్యముగ శీతకాలపు విదేశీయ జాతులను చురుకుగ నెదిగించ దలచుచో గుర్రపు లద్దెను వాడవచ్చును. దానిని వేయుటకు ముందు ప్రత్యేకముగగాని, పశువుల పేడ, ఎర్రమన్ను, యిసుక వీనితో గలిపిగాని తడిపి బాగుగ చీకనీయవలెను.

మరియు పండింపబడు కూరజాతులలో నుపయోగకరమగు భాగములుగాక తక్కినవానిని పారవేయక లేక కాల్చివేయక అన్నిటిని కూడబెట్టి చీకనిచ్చి యెరువుగ నుపయోగించుచుండవలెను. తైలపిష్టములుకూడ నేలకు కార్బనిక పదార్థమును చేర్చుటయేగాక, ఆహారమూలకములను హెచ్చుగ నిచ్చును.

చురుకుగ బని చేయుటకు పైన చెప్పినట్లు మూత్రపు మంటినే గాక అమ్మోనియం సల్ఫేటు, కాల్షియం నైట్రేటు, యూరియా మొదలగు కల్పితమగు నెరువులను (సారదములను)గాని వాడవచ్చును. వీని ప్రమాణమును వానియందలి నత్రజని పరిమితినిబట్టి నిర్ణయించుకొనవలెను. అధికముగ వేయుచో మొక్కలు వేడిచేసి చావవచ్చును. లభించుచోట్ల సురేకారము విస్తారముగ గలిసియుండు పాటిగోడల చౌటిని గూడ నుపయోగింపవచ్చును. ఒక బండి బాగుగ ఊరిన మూత్రపు మన్నును అరబస్తా (40 కిలోగ్రాములు) వేరుశనగ పిండితోగాని, పావుబస్తా (20 కిలోగ్రాములు) అమ్మోనియం సల్ఫేటుతోగాని తుల్యముగ నెంచవచ్చును.

ఒక్కొక్కప్పుడు ఎముకలపొడిని, సూపర్ ఫాస్ఫేటును వేయుటగూడ లాభకరముగ నుండును. సెంటుకు

1 కిలోగ్రాము చొప్పున సంవత్సరమున కొకసారి వేసిన చాలును. ఇందలి భాస్వరము కాపునకును, కొంతవరకు కూరల రుచికిని తోడ్పడవచ్చును.

పొటాషు యెరువులను సొమ్ముపెట్టి కొనివేయుట సామాన్యముగ లాభకరముగనుండదు. అవసరమును నుండదు. పొటాషును జేర్పనవసరమగుచో సామాన్యముగ బూడిదను జేర్పవలెను.

చెట్లను అతి త్వరగా ఫలితము నిచ్చునట్లు ప్రోత్సహించుటకు 'ద్రవపు ఎరువు'ను ఉపయోగింతురు. పచ్చి పేడను నాలుగింతలు నీరుచేర్చి రాతి తొట్టెలలో పదిరోజులు మురగనివ్వవలెను. అడపతడప కలుపుచుండవలెను. పది రోజులు ముగిసిన తరువాత దానిని తేర్చి పైనీటిని తీసుకొనవలెను. దానికి సమపాలు నీరు మరల చేర్చిన టీ రంగునకు వచ్చును, దానిని ద్రవపు ఎరువుగా నుపయోగింపవచ్చును.

దీనినే మరొక పద్ధతిగా కూడ తయారు చేయవచ్చును. పేడను పల్చటి గుడ్డసంచిలో మూటగట్టి దానిని తొట్టిలోని నీటిలోనికి వేలాడదీయవలెను. కొద్దిరోజులలో దానిలోని సారమంతయు నీట ప్రవేశించును. ఆనీటికి టీరంగు వచ్చువరకు నీటినిచేర్చి ఉపయోగించవచ్చును.

నాటిన వెనుక నిలద్రొక్కుకొని ఏపుగ నెదుగ ప్రారంభించిన మొక్కలకు ద్రవపు ఎరువులను వేయవచ్చును. పిందె కట్టిన తరువాత ద్రవపు ఎరువులు వేయుటచేకాయలు బాగుగ పెరుగును.

సారదములు: రసాయనిక ఎరువులని పిలువబడు పదార్థములు ఆహార సారముల నిచ్చునవగుటచే వాటిని సారదములనుట ఉచితము.

మొక్కల పెరుగుదలకు ఎక్కువగా కావలసిన పది మూలకములను బృహన్మూలకములనీ, స్వల్పముగ కావలసిన అయిదారు మూలకములను ఈ పరమాణుమూలకములనీ వ్యవహరించుట సుకరము. వీటి ఆవశ్యకతను తెలుసుకొనుట అవసరము. దీనిని గూర్చిన వివరములు..................లో గలవు. ఇచ్చట కొన్ని విశేషములు మాత్రము తెలుపబడినవి.

నైట్రొజను:- ఇది ఆకులు, కాడలు పెరుగుటకు కావలెను. నైట్రొజను వలన శాకములు రసవంతములుగ నుండును. కాయల, గింజల పక్వమును ఇది ఒకింత ఆలస్యము చేయును. నైట్రొజను లోపముగల మొక్కలు పచ్చబారి గిడసబారి యుండును. కాని తిరిగి నైట్రొజనుగల సారదములను వేయుటచే మొక్కలు శీఘ్రముగనే తిప్పుకొనును.

అమ్మోనియం సల్ఫేటు (20%) యూరియా (46%) కాల్షియం అమోనియం నైట్రేటు (        ) అమ్మోనియం ఫాస్ఫేటు (        ) మున్నగునవి సామాన్యముగ లభించు నైట్రొజను సారదములు.

ఫాస్ఫరసు:- (భాస్వరము) చాల కాలముగా సారదములలో పంటలు పండించుచున్న నేలలకు ఫాస్ఫరసు అంత ముఖ్యముకాదు. క్షారాంకము 7 దాటిన చవుడు నేలలో

ఫాస్ఫరసు ఉన్ననూ లభ్యరూపములో నుండదు. ఫాస్ఫరసు లోపించిన మొక్కలు పెరకువతగ్గి, చిన్న ఆకులతో, ఎరుపు తిరిగిన ఈనెలు కాడలు కలిగియుండును. కాయల, గింజల పక్వము ఆలస్యమగును. సూపరు ఫాస్ఫేటు (16°/₀) అమ్మోనియం ఫాస్ఫేటు ( ) సామాన్య సారదములు.

పొటాసియం:- కార్బొహైడ్రేటులు (పిండ్లు, చక్కెరలు) ఒకచోటనుండి మరియొక చోటికి మొక్కలో పయనించుటకు పొటాసియం అవసరమని భావించుచున్నారు. కావున దుంపకూరలకు పొటాసియం ఎక్కువ ఆవశ్యమందురు. దీని లోపము వలన ఆకుల అంచులు మాడుటయు, పెరకువమందగించుటయు, వేళ్ళు సన్నబడుటయు జరుగును. ఇసుక నేలలలో దీనిలోపము తరచుగ కలుగవచ్చును. పొటాసియం సల్ఫేటు క్లోరైడు (మ్యూరియేటు) తరచుగ దొరకు సారదములు.

కాల్షియం:- మొక్కలకు చాల ప్రధానమయిన మూలకమే అయినను, పులుపు నేలలలో తప్ప దీని లోపము కలుగదు సూపర్ ఫాస్ఫేటులో కాల్షియం కూడ నుండుట చేత, దీనిని ప్రత్యేకముగ వేయవలసిన పనిబడదు.

గంధకము:- ఇదికూడ మొక్కలకు ప్రధానముగా కావలసినను. సల్ఫేటు లన్నిటి ద్వారా మొక్కలకు లభ్యమగుటచే, దీనిలోపము నెదుర్కొన వలసిరాదు.

మెగ్నీషియం:- ఇసుక నేలలలో దీనిలోపము సకృత్తుగా కలుగవచ్చును. అందువలన ఆకులు ఈనెల సందున

తెల్లబడుటయు మొక్కలు పెరుగకుండుటయు సంభవించ వచ్చును. ముఖ్యముగా కాబేజి, కర్బూజ, టొమాటో, చిక్కుడు మొక్కలు దీని లోపమువలన బాధపడును. పొటాసియమును అతిగా వేయుటవలన కూడ మెగ్నీషియం లోపపు చిహ్నములు కలుగును. మెగ్నీషియం సల్ఫేటును (విరేచనాల సాల్టు) ఆకులపై చిమ్మి లోపమును సవరింప వచ్చును.

ఈషణ్మాత్రలకములు:

బోరాను:- తటస్థ క్షీరాంకముగల ఇసుక నేలలలో హెచ్చుపంటలు తీసినచోట్ల బోరానులోపము సంభవింప వచ్చును. చవిటి నేలలలో బోరాను ఒకవేళ నేలలో ఉన్నను లభ్యముకాదు. దీనిలోపమువలన, బీటుదుంపల లోపల కుళ్ళుట, దానిలోని నల్లచుక్కలు, కాలీఫ్లవరులో ఎర్రకుళ్ళు పువ్వు రంగుతిరుగుట మొదలగునవి కలుగును. వెలిగారము‌ను నేలలో హెక్టారుకు 2 కి. గ్రా. చొప్పున గాని, చవిటి నేలయితే, లీటరుకు మిల్లిగ్రాముల వంతున నీళ్ళలో కలిపి ఆకులపైనేగాని చల్లి లోపమును నివారింపవచ్చును.

ఇనుము:- దీని లోపము వలన లేత ఆకులు పాలిపోవును. అన్నభేదిని నీటకలిపి 1% ద్రావణముగా ఆకులపై చిమ్మి లోపమును నివారింప వచ్చును.

మాంగనీసు:- అనేక ముఖ్య జీవచోదకములలో (ఎన్జైములలో) భాగముగనుండుటచే, దీనిలోపము మొక్కలను బాగుగ బాధించును. దీని లోపమువలనకూడ లేత ఆకులు ఈనెల సందున పసిమిగ మారును. ఈనెలు ఆకుపచ్చగనే

యుండును. కొన్ని వులుపు నేలలలో ఇది అధికమై మొక్క లకు హాని చేయును, ఇది అధికమయినపుడు లక్షణములు ఇనుము లోపమువలెనుండును. చిక్కుడు, ఉల్లి, టొమాటో, బీటు దీనిలోపము వలన బాధపడు పైరులు, మాంగనీసు సల్ఫేటును ఆకులపై చిమ్మిన లోపము సవరణయగును.

తుత్తునాగము (జింకు):- పండ్ల చెట్లలో తరచుగ కాన వచ్చు దీనిలోపము, కూరగాయలయందు అంతగ కానరాదు. వచ్చినచో జింకు సల్ఫేటుమ చిమ్మవచ్చును.

మాలిబ్డినం:-దీని లోపమువలన కాలీఫ్లవరు (పూగో బి)లో 'ఈనెఆకు' వచ్చును. అమ్మోనియంమాలిబ్డేటుతో సవరింపవచ్చును.

పై మూలకము లన్నిటిలో నైట్రోజను, ఫాస్ఫరసు, పొటాషు మిగిలిన వాటికంటె ముఖ్యము, ఎక్కువ ప్రమాణములో కావలెను. కావున వ్యాపారమున నున్న సారదము లలో వీటి శాతమును బస్తాపై చూపుదురు.

కూర పైరుల సార ఆవశ్యకతను రెండు విధములుగా విడదీసి చెప్పవచ్చును. మొదటిది మూలకముల నిష్పత్తి, రెండవది నిర్ణయించిన నిష్పత్తిలో కావలసిన ప్రమాణము - దీనిని తీవ్రత అనవచ్చును. నిష్పత్తి పైరు నైజమునుబట్టియు, తీవ్రత వచ్చు పంటను (దిగుబడి)ని బట్టియు మారును. రెండునూ, నేలలోని సారమునుబట్టి మారును.

ఎరువులను (పశువుల ఎరువు, గానుగపిండి మొ॥ కార్బనిక వస్తువులను) సాధారణముగా దుక్కిలోనే వేయుట

ఆచారము. సారదములను విత్తుటకుగాని, నాటుటకుగాని ముందు లేక ఆసమయమున వేయుదురు. గొర్రుతో, మర గొర్రుతో విత్తువారు, విత్తనపు చాళ్ళ కిరువైపుల రెండు మూడు అంగుళముల దూరమున చాళ్ళలో సారదములను వేయుట కలదు. అట్టి సౌకర్యము లేనిచో ఆఖరు దుక్కిలో నాగటి చాలున కూడ వేయవచ్చును. సారదమును నేలంతటను వెదజల్లుట సులభమయినను, మొక్కలు ఎదిగి, వాటి వేళ్ళు నేలయంతటను వ్యాపించి, ఆసారమును గ్రహించు లోపల అది కొంతవరకు నష్టము కావచ్చును. ఫాస్ఫరసు, పొటాషుల విషయమున అట్టిభయము అంతగా లేకున్నను నైట్రొజను విషయమున లేకపోలేదు. మొక్కలను నాటునప్పుడు లేక గింజలను తగుదూరమున గుచ్చునపుడు దానికి బెత్తెడు దూరమున (8-10 సెం.మీ.) చుట్టును గిరిగీసి ఎరువును వేయవచ్చును.

స్వల్పకాలపు పైర్లకు (నాలుగు నెలలలోగా తీసివేయ దగునవి) ప్రారంభములోనే వేయదగు సారదములను మొత్తము వేయుదురు. ముఖ్యముగా జిగట నేలలోను, కార్బనిక పదార్థము హెచ్చుగ గల నేలలలోను ఇట్లు చేయవచ్చును. దీర్ఘకాలపు పైర్లకు, ఇసుక నేలలపైనున్న పైర్లకు కనీసము నైట్రొజనునైనా రెండు మూడు తడవలుగ వేయుట శ్రేయము.

నారు నాటునప్పుడు నీరు పోసి నాటుట లేదా నాటి నీరుపోయుట ఆచారము. ఉత్త నీరుకు బదులు అందు అధిక సారపు సారదములను కరిగించిన ద్రవమును పోయుటచే

ఇసుక నేలలలో, తత్పూర్వము అంతగా సారమునొందని నేలలలో పంట ఎక్కువగునని అనుభవము. ఒకప్పుడు పంట త్వరితముగ రావచ్చును. ఇట్టి ద్రవమును స్టార్టర్ సొల్యూషను అందురు. దీనిని 'చాలనద్రవం' అనవచ్చును. నైట్రోజను, ఫాస్ఫరసు, పొటాషులు మూడును చేరి సుమారు 50 ఉండే సారదాన్ని (ఉదా॥ 13-26-13) లీటరుకు 5 గ్రాములవంతున నీటిలో కరిగించి, మొక్కకు 150 నుండి 250 మిల్లీలీటర్లు (1/4-1/6 లీటరు) వేయవచ్చును.

ఈషణ్మూలకముల లోపము తరచుగ కన్పడుచోట్ల ఆయా మూలకములను నీట కరిగించి ఆకులపై చిమ్ముటచే సత్ఫలితములు కలుగుటనుబట్టి బృహన్మూలకములను కూడా ఆకులద్వారా అందించు ప్రయత్నములు కొన్ని లాభదాయకముగనున్నట్లు చెప్పబడినవి. అవి కావలసిన ప్రమాణములు ఎక్కువగుటచేతను, 2, 3 శాతమును మించిన చిక్కదనము గల ద్రావణములను చిమ్ముటవలన ఆకులు మాడుటవలనను మొక్కలకు తగుమాత్రపు ఆకులు వచ్చువరకు ఎక్కువ ద్రవమును పీల్చునవకాశము లేకుండుటవలనను, పైరుకు కావలసిన మొత్తపు సారములో సగమునకుమించి ఆకు ద్వారా ఇచ్చుట సాధ్యముకాదు. అదియు నాలుగయిదు చిమ్మకములుగ నీయవలెను. నైట్రోజనును పొటాషియమును ఇచ్చు ద్రవ్యములు నీట సులభముగ కరుగును. సూపర్ ఫాస్ఫేటును కరిగించి వడబోయవలసిరావచ్చును.

ఇళ్ల పెరళ్లలో పెంచు కొలది మొక్కలకు రసాయనిక ఎరువులను వేయునపుడు మోతాదును ఉజ్జాయింపుగా

గాక వాటిని నీట కరగించివేయుట శ్రేష్ఠము. 15-20 గ్రాముల ఎరువులు 5 లీటరుల నీటిలో కరిగించి మూడు చదరపుమీటరుల కూరమడికి సర్దవచ్చును. ఇట్లు వారమున కొకసారి వేయుచు మోతాదును క్రమముగా మూడు రెట్లు చేయవచ్చును.

నేలలేని సాగు :— పట్నములలో మేడలలో నివసించు వారలకు కూరగాయలను పెంచుటకు నేలయే దొరకదు. అట్టి వారికొరకై నేలలేని సాగు రూపొందించబడినది. దీనివలన నేలలేకయే మొక్కలను పెంచగలుగుటయేగాక, వాటి పంటకూడ మేలుగ నుండునని కనుగొనబడెను. దాని సూత్రమొక్కటే; మొక్కలకు పలయు మూల ద్రవ్యముల నల్ల తగు పాళ్లలో నేరుగ నందించుట. దీనియం దనేక విధానములున్నవి. ఇందు బెంగాలు పద్ధతి యనబడు విధానము టూకీగా వర్ణించబడినది.

కఱ్ఱ, సిమెంటు తొట్లెవైనను ఉపయోగించవచ్చును. తొట్టి ఒక మీటరు వెడల్పు, 20 సెంటిమీటర్ల (8 అంగుళముల)లోతు, అనుకూలమయినంత పొడవు వున్నచో వీలుగ నుండును. మురుగునీరు వడియుటకు సదుపాయముండవలెను. దీనిని నింపుటకు ఈ క్రింది మిశ్రమము నుపయోగింతురు. రాతితుంపులు, గులకరాళ్లు, ఇటుక ముక్కలు, బొగ్గులు మొదలగునవి 5 నుండి 15 మిల్లీమీటర్ల గడిగల జల్లెడ పట్టినవి అయిదు వంతులు, 2 వంతులు ఇసుక చేర్చిన మిశ్రమము తయారగును. క్రిందినుండి గొట్టములద్వారా నీటి నెక్కించి మిశ్రమమును తడిగా నుంచుదురు. వీలుగానిచోట

పైనుండి చల్లినను చల్లవచ్చును. ఈ క్రింద చూపబడిన పాళ్ళలో ఆహార మిశ్రమమును తయారుచేయుదురు.

| | |
|---|---|
| అమ్మోనియం సల్ఫేటు | 350 గ్రాములు |
| (యూరియా అయినచో 170 గ్రా. చాలును) | |
| సూపరు ఫాస్ఫేటు | 200 " |
| కాల్షియం సల్ఫేటు | 85 " |
| పొటాసియం సల్ఫేటు | 140 " |
| మెగ్నీషియం సల్ఫేటు | 115 " |
| ఈమణ్మూలకముల మిశ్రమము | 500 మిల్లి గ్రా. |

ఈమణ్మూలకముల మిశ్రమమున నీ క్రింది పదార్థములు అందు చూపబడిన పాళ్లలో చేర్చబడియుండును.

| | |
|---|---|
| జింకు సల్ఫేటు | 3 గ్రాములు |
| మాంగనీస్ క్లోరైడు | 9 " |
| బోరిక్ ఆసిడు | 7 " |
| కాపర్ (రాగి) సల్ఫేటు (మైలతుత్తం) | 3 " |
| ఐరన్ (ఇనుము) సల్ఫేటు | 10 " |

ఈ మిశ్రమమునుండి అరగ్రాము మాత్రము పైనచెప్పబడిన ఆహార మిశ్రమమున చేర్చబడినది.

పై పాళ్లలో ఆహార మిశ్రమమును చేసియుంచుకొని, ప్రతి చదరపు మీటరు మేరకు 70 గ్రా. వంతున పదిరోజుల కొకసారి పరచి, నీటిని చిమ్మవలెను.

తొట్లలో మొక్కలను నాటి, అవి పెరుగుకొలది వాటిని ప్రక్కనే నాటిన కొయ్యలకు చేర్చి కట్టవలెను. నెల కొక

తూరిదైన మంచి నీటిని విస్తారముగ పెక్కుసారులు పోసినేల మిశ్రమమును కడుగుట మంచిది.

విత్తనము: విత్తుకొలది పంట అను సూక్తి ననుసరించి మంచి విత్తనమును ఏరుకొనుట చాల ఆవశ్యకము. విత్తనమునందు కలువు విత్తనములు, దుమ్ము మొదలగు ఇతరములు చెత్తయుండరాదు. విత్తనము మొలచునదై యుండవలెను. విత్తనముల మొలచుశక్తి ఆయాజాతిని బట్టియు, రకమును బట్టియు నిర్ణయమగును. కాని విత్తనమును దాచెడి జాగ్రత్తపైకూడ ఇది ఆధారపడియుండును. ఎక్కువ వెచ్చదనము, తేమగల ప్రదేశములలో దాచిన విత్తనము మొలకెత్తు శక్తిని చాల త్వరగా కోల్పోవును. విత్తనములు వ్యాధులులేక యుండవలెను. కొన్ని వ్యాధులకు కారణమగు శిలీంధ్రములు విత్తనములయందు నిలచియుండి మొలకెత్తగనే దాని నెదుర్కొనును. అట్టివి విత్తనపు పై పొరయందేయున్నచో సిరసాన్, అగ్రసాన్‌వంటి మందులతో పొలిపి చల్లవచ్చును. అన్నిటికంటె ముఖ్యముగా విత్తనము మనముకోరిన రకమునకు చెందినదై యుండవలెను. పెక్కురకముల కలయికగానుండరాదు. తరచుగ విత్తనము ఏ రకమునకు చెందినదియు పైకి తెలియదు. కనుక నమ్మకమయిన చోటినుండి విత్తనములను తెచ్చుకొనుటయే యీ విషయమున శ్రీరామరక్ష. ఎవరి విత్తనములను వారు కట్టుకొనదలచినచో పూవు విచ్చకముందే దానికి చిన్న కాగితపు సంచినితొడిగి, పిందె కట్టిన వెనుక తీసివేయవచ్చును. అట్టి విత్తనములు సాధారణముగ కల్తీలేక ఒక్కసమముగ నుండును.

రెండు స్వచ్ఛమయిన తెగలను సంకరించినచో కలుగు విత్తనములను మొలిపించినచో, ఆ మొక్కలు తలిదండ్రులను మించిన ఏపు, కాపుకలిగియుండునని కనుగొనిరి. ఇట్టి "ఏపును సంకర బలమందురు" (Hybrid Vigour), జొన్న, సజ్జ, మొక్కజొన్న మొదలగు పైర్లలో హెచ్చు పంటనిచ్చు సంకర రకములు పరిచితములేగదా! కూరలలో వంగ, సీమవంగ, ఉల్లి, దోస, గోబి మొదలయినవి ఇందుకు తగియున్నవని తెలిసెను. ఇట్టిసంకర విత్తనమును (Hybrid Seed) తయారు చేయుట నిపుణులు చేయదగుపని. ఇట్టి విత్తనమును సంపాదించి, పైరును పెంచినవారు దానినుండి మరల విత్తనమును పోగు చేయుటకు ప్రయత్నింపరాదు. అట్లు పోగుచేసినచో దాని నుండి మొలచు మొక్కలు ఒక్క సమముగానుండక నానా రకములుగ ఉద్భవించును. సంకర విత్తనములను తయారు చేయుటకు తగు సీమవంగ స్వచ్ఛమగు తెగలను ఢిల్లీలో ఉత్పత్తి చేయుచున్నారు.

విత్తుట :- కూరజాతులలో గొన్ని 12-14 పుటలందు వర్గీకరణమున దెలుపబడినట్లు విత్తులను నేరుగ నాటి పెంచునవిగ నుండును. కొన్నిటికి ముందుగ నారుమడిలోగాని నారు పళ్లెములోగాని చల్లి పెంచిన నారు మరల దీసి నాటవలసియుండు. కొన్నిటిని కాండపు ఖండములవలన గాని, దుంపలను వాని ఖండములను నాటుటవలనగాని వృద్ధి చేయదగి యుండును.

కొన్ని జాతుల విత్తులను వెదజల్లవచ్చును. సామాన్యముగ మిగుల చిన్నవిగ నెమగు మొక్కల విత్తుల నిట్లు చల్లు

దుంపలను ఉప్పు చేర్చిన నీటిలో నుడికించి తీసి ముక్కలుగ కోసి వెన్న లేక నేతిలో వరుసగా పిండి, మసాలా ద్రవ్యములు వేసి తుదకు పాలుపోసి తయారుచేసిన మిశ్రణమున వేసి ప్రయ్యనిచ్చి మునగకాడ కూరవలె తయారుచేసి కూడ తినవచ్చును. శుభ్రిముచేసిన దుంపలను మెత్తని ముద్దగ నూరి నెయి, చక్కెర, ద్రాక్షపండ్లు, గోధుమనూక, ఏలక పొడి వగైరాలతో కలిపి ఆవిరిపై నుడికించి తినినగూడ రుచిగ నుండును. దుంపలను మిగుల మృదువుగ నుండునట్లు నుబ్బి నెయి, చక్కెర, జీడిపప్పు, పరిమళ ద్రవ్యములతో కలిపి హల్వాగా తయారుచేసి పళ్ళెములో చల్లార్చి ముక్కలుగ కోసి యుపయోగింపవచ్చును.

గాజరదుంపలో ముల్లంగి, నూలుకోలు మొదలగు వానిలోకంటె నీరు తక్కువ. పౌష్టికశక్తి, పిష్టద్రవ్యములు హెచ్చుగనుండు ఉరలగడ్డ మొరలగువానికిని అవి తక్కువగ నుండు ముల్లంగి మొదలగు దుంపలకును మధ్యమముగ నుండును. సంఘట్టనము I-అ, ఆ అనుబంధములందు దెలుపబడెను. మాంసకృత్తుల పరిమితియు, ఖనిజద్రవ్యముల పరిమితియు మధ్యమము. కాని గాజర దుంపలలో విటమిను ఎ నొసగు కరోటీన్ తక్కిన దుంపకూరలలో కంటెను కాయకూరలలో కంటెను హెచ్చుగ అనగా కొన్నిజాతుల ఆకుకూరలతో సమముగ నుండుటచే నిది దుంపజాతులలోనికెల్ల ఆరోగ్యవంతముగ నెంచబడుచున్నది. ఇందు విటమిను బి కూడ కొంతగలదు. విటమిను సి చాల తక్కువ.

పార్స్నిప్ (Parsnip - Pastinacea sativa) :— ఇది ధనియపు కుటుంబములో జేరిన మరియొక దుంపజాతి. ఇది కొంత యున్నతముగల బెంగుళూరు ప్రాంతములందే గాని సమప్రదేశములందు పెరుగదు. సేద్యము గాజరదుంపవలెనే.

దుంపసెలరీ (Turnip-rooted celery. Apium graveolens, var. rapacea) :— సామాన్యముగ ఆకుకూరగ నెంచబడు సెలరీలో నిదియొక ఉపజాతి. ఈ మొక్కయు సెలరీ మొక్కను బోలియుండును. దుంప గాజరదుంపవలె యుపయోగింపదగి యుండును. సేద్యమును సెలరీవలెనే కాని ఆకు తొడిమలకు వెలుతురు తగులకుండ చేయ నవసరము లేదు.

## 12 ఎ దుంప ఆర్టిచోక్

Jeruselem artichoke-Helianthus tuberosus
N. O. Compositae.

ఇది సూర్యకాంతపు గణమున జేరిన దుంపజాతి. వేర్లే దుంపలుగ పరిణామము నొందును. మొక్కలు సూర్యకాంతపు మొక్కలవలె 0.90-1.20 మీ. యెత్తెదిగి అట్లే చెండ్ల నంటి పూవులను బూయును. సామాన్యపు తోటనేల లన్నిటియందును సులభముగ బెరుగును. దుంపలనుతొలకరికి ముందు అనగా మే నెలలలో 45 సెం. మీ. దూరమున నాటినచో శీతకాల ప్రారంభము (నవంబరు) నుండి క్రొత్త దుంపలను ద్రవ్వి తీయ వీలగును. దుంపలు బాగుగ నూర వలెననిన పూవులను విడువకముందే గోసివేయవలెను.

మరుసటి సంవత్సరమున నాటుటకు వలయు విత్తనపు దుంపలను త్రవ్విన వెనుక తడిలేకుండ నెండబెట్టిన పొడియిసుకలోగాని మంటిలోగాని నిల్వ చేయవలెను. లేక దుంపలను త్రవ్వకుండ పెరిగినచోటనే యుంచి పైని దళముగ 15 సెం. మీ. యెత్తున నేదేని చెత్తవేసి కప్పి యుంచవలెను. దుంపలను గాజర, ముల్లంగి దుంపలవలెనే వివిధములుగ వండి తినవచ్చును. సంఘట్టనమునుగూర్చి తెలియదు.

## 13. దుంపబచ్చలి లేక బీటుమంప

**Beet root Beta-Vulgaris, N. O. Chenopodiaceae.**

హిందీ – చుకందర్

ఇది బచ్చలి కుటుంబములోఁ జేరిన విదేశీయపు దుంపజాతి. దీని కాదిమస్థానము దక్షిణ ఐరోపాయని యూహింపబడుచున్నది.

బీటుమొక్క నూలుకోలు, ముల్లంగి మొదలగువానివలెనే యీ దేశమున కురుచగ అనగా సుమారు 30 సెం. మీ.ల ఎత్తెదుగును. తల్లివేరు మొక్క పై భాగమే దుంపగ పరిణామ మొందును. వేరుమొక్క పరిణామమే యయినను నీ దుంపకు భూమిపైకి పెరుగు స్వభావము కొంత గలదు. ఈ దుంప దిగువ వేరు సన్నగిలి తోకవలె నుండును. దుంపపైనను, తల్లివేరు క్రింది భాగముపైనను పీచు వేళ్ళు స్వల్పముగ నుండును. ఆకులు తొడిమలు గలిగి కొంతవరకు సీటివంగ ఆకులను బోలియుండును. దుంపలన్నియు నేల మట్టమునుండియే బయలుదేరు చుండును. శీతల ప్రదేశము

ట్లో దుంప యూరిన వెనుక మరి కొంతకాలము పెరుగ నిచ్చినయెడల దానినుండి నిడివియగునకాడ బయలుదేరి దాని చివర నాలుకోలులోవలెనే పూవుల గెల బయలు దేరును. కాని యీ మొక్క ఈ ప్రాంతములందు పూయదు. కావున విత్తులను పైనుండియే తెప్పించుకొనవలసియుండును.

92 వ పటము



బీటుదుంప (¼ సైజు)

బీటు దుంపలలోగూడ పెక్కు రకములు గలవు. తీపి హెచ్చుగ నుండుటచే, చక్కెర దీయుటకై ఐరోపాఖండమునను, కొన్ని ఇతర దేశములందును విరివిగ సాగు చేయబడు చక్కెర బీటుదుంపను గురించి చెఱకు అను గ్రంథమున చక్కెరనొసగు ఇతర సస్యములు అను అనుబంధమున 1-4పుటలలో వ్రాయబడెను. కూర కుపయోగింపబడు రకములో నంత తీపి యుండదు. ఇందు తెలుపు, ఎరుపు రకములు గలవు. ఎరుపు రకములలో పైననేగాక దుంప లోపల గూడ రక్తవర్ణము గలిగియుండి కోసినపుడు మాంసపు ముక్కలవలె నుండుటచేతనే దీనిని కొందరు శాకాహారులు దరిజేర నివ్వరు. గుండ్రరకములును, కోలరకములును గూడ గలవు. దుంప కొంచె మించుమించు సన్నగనుండు రకములును ఉపరితలమున పెండలపు దుంపయందువలెనిమ్నోన్న

తములు గల రకములును గలవు. మేంజల్ వర్జల్ (Manzel wurzel) అను నొక రకము పెండలమువలె మిగుల పెద్ద దుంపలు గలిగి ఐరోపాఖండమున పందులకును, పశువులకును ఆహారముగ నుపయోగింపబడుచుండును. ఆకులకొరకు పెంచబడు రకము (Swisschard) కూడ నొకటి గలదు. సామాన్యముగ కూరదినుసుగ నుపయోగించు రకముల దుంపలు త్వరలో (సుమారు 2 నెలలలో) నూరును. పశువులకొరకు పెంచబడునవి యూరుటకు హెచ్చుకాలము పట్టును. క్రింసన్ గ్లోబ్, డెట్రాయిట్ డార్క్ రెడ్ అను రకములు ఎక్కువగ వ్యాప్తిలో నున్నవి.

బీటు దుంపనుకూడ యీ దేశమున శీతకాలమున మాత్రమే సాగుచేయ వీలగును. చలి హెచ్చుగనున్న స్థలమందే బాగుగ పెరుగును. ఈ కాలమందైనను వర్షములు వెనుకబట్టిన వెనుక నెలకొకసారి అనగా సెప్టెంబరు మొదలు డిసెంబరువరకు విత్తుచుండవచ్చును. వర్షము తక్కువగ గురియుచోట్లను చల్లగనుండు చోట్లను మరియొక నెల ముందుగగూడ విత్తవచ్చును. 40-45 సెం. మీ. దూరము గల వరుసలలో నేరుగ విత్తి 30 సెం. మీ. కొక మొక్క యుండునట్లు పలుచనచేసి ముల్లంగివలెనే సాగు చేయవలెను. ఆరుకు 60 గ్రాములు విత్తులు పట్టును. 80-100 కి. గ్రా. దుంపలగును.

బీటుదుంపను ముల్లంగి, దుంపఆవ మొదలగు వానివలెనే చప్పిడికూరగగాని, పప్పుకూరగగాని, పులుసుపెట్టిగాని వండి తినవచ్చును. ముక్కలను పులుసులోవేసి యుడి

కించి తినవచ్చును. దీనిని మాంసాహారులు ఆకుకూరలతో తరచు చేర్చి తినుచుందురు.

బీటుదుంప గాజరవలెనే మధ్యమ పౌష్టికశక్తి గలది. మాంసకృత్తుల పరిమితి కొంచె మించుమించు ఉరలగడ్డతో సమానము. ఇందు దుంపజాతు లన్నిటిలోను హెచ్చు సున్నము గలదు. విటమిను ఎ శూన్యము. విటమిను బి, పరిమితి మధ్యమము. విటమిను సి పరిమితి తక్కిన దుంప జాతు లన్నిటిలోకంటెను హెచ్చు. కావున మొత్తముమీాద నిది యాహారయోగ్యమగు దుంపజాతిగ నెంచవచ్చును.

## 14. వన్యజాతులు

1. అడవికంద* (Amorphophallus sylvatius - N. O. Aroideae) :— ఈ మొక్క కొంచె మించుమించు దేశవాళి కందమొక్కను బోలియే యుండును. కాని దానికంటె పెద్దది. దుంపయు పెద్దదిగ నూరును. ఇందు దురద హెచ్చు. కావున నిది యాహారముగ నుపయోగింపబడుట యరుదు. నీటితో నుడికించుచు పెక్కుసార్లు నీటిని వార్చి వేసినగాని తిన వీలుగాదు. ఈ దుంప వైద్యులచే మూలశంక మొద లగు రోగములందు వాడబడుచుండును.

2. నీటిచేమ (Colocacia antlquorum N. O. Araceae) :— చేమ చాలచోట్ల సాగుచేయబడుచున్నను సరోవరములు, యేర్లు, జలాశయములు మొదలగువాని యోర

* సంస్కృతము - వనశూరణ.

లను సంవత్సరము పొడవునను తేమగనుండు నేలలందును తరచు స్వతస్సిద్ధముగగూడ బెరుగుచుండును. ఇట్లు పెరుగు చేమకు నీటిచేమ యని పేరు. తెల్లచేమయు, నల్లచేమయు గూడ నిట్లు బెరుగును. కాని రెండవదియె తరచుగ నిట్లు పెరుగుచుండునది. ఇట్లు వన్యముగ బెరుగు చేమ దుబ్బులు భూమిలో నిడివిగ బెరుగు కాండ పరిణామములగు గామినుల (Runners) మూలమున ప్రక్కలకు చురుకుగ వ్యాపించి చాల ప్రదేశము నాక్రమించుచుండును. వీని దుంపలును ఆకులునుగూడ సమీపవాసులచే నాహారముగ నుపయో గింపబడు చుండును.

4. బొమ్మకచిక (Zingibar roseum - N. O. Zingiberaceae) ;— ఇది వన్యస్థితిలో పెరుగు అల్లపుగణములో జేరిన యొక దుంపజాతి. దుంప అల్లపు దుంపవలె పెరుగును. ఆకులు పసుపు ఆకులవలె యుండును. కాని అంతకంటె కొంచెము చిన్నవి. సుమారు 30 సెం.మీ.వరకు పొడవును, 15 సెం.మీ.వరకు వెడల్పును గలిగియుండును. అంతకంటె దళముగ నుండును. అంచులు తరంగ వాటము (Wavy) గ నుండును. వర్షకాలమున మొక్కల మధ్యనుండి సుమారొక 30 సెం. మీ. పొడవుండు పూవులగుత్తి యొకటి బయలుదేరును. ఒక్కొక గెలలో నూరు పూవుల వరకుండ వచ్చును. ఇందలి పూవుల చేటికలు రమ్యమగు నెరుపురంగు గలిగియుండును. కాయలు మూడేసి యరలు గలిగియుండును. ఒక్కొక యర పెద్ద యేలకకాయ ఆకారముగలిగి 20-30 ఏలక గింజలవంటి నల్లని గింజలు గలిగియుండును.

దీనిని దుంపవలననే వృద్ధిచేయవచ్చును. కాని దీని నిదివర కెచ్చటను ప్రత్యేకముగ బెంచుట కానము.

ఈ దుంపలను అల్లము మామిడల్లమువలెనే ముక్కలుగ గోసి నిమ్మకాయ రసములో నూరవేసి తినవచ్చును. లేక పచ్చడిచేసియుపయోగించవచ్చును. ప్రత్యేకపు పరిమళము ఏమియులేదు. ముదిరిన పీచు గట్టుటచే దుంపంతగా ముదరక మునుపే తీసి యుపయోగించవలెను.

ఆ. తీగలుగ బెరుగు దుంప జాతులు.

దుంపల నొసగు తీగజాతులలో చిరుగడము, పెండలమును మాత్రమే సాగునందున్నవి.

## 1. చిరుగడము

**Sweet potato - Ipomoea batatas, N. O. Convolvulaceae.**

అరవము-శక్కరై కిజంగు; కన్నడము-గెనుసు; ఒడ్రము-కొందామూళో; హిందీ-శక్కర్‌కంద్; సంస్కృతము-పిండకందం.

దీనినే కొందరు చిలగడమనియు, కందమూలమనియు గూడ వ్యవహరింతురు. చిన్నదుంపలను బెట్టు ఒకవిధమగు పెండలముగూడ చిరుగడము లేక సీరుగడము అని వ్యవహరింపబడుచున్నది. దీనిని గురించి ముందు వ్రాయబడును. చిరుగడమున కాదిమస్థానము అమెరికా యందలి ఉష్ణభాగముగ నెంచబడుచున్నది.[28] ఈ దేశమున కెప్పుడు వచ్చునో తెలియదు. కాని యిపుడది యీ దేశమునం దంతటను సాగునందు గలదు. ఈ దుంప ప్రపంచమందలి యితరఉష్ణ న్యా

రలు గలిగియుండును. కీలము పొడవుగా నుండును. పూవులు సామాన్యముగ నాత్మ సంపర్కమువలన గర్భవతులు కానేరకపోవుటచే కాయ లేర్పడి గింజకట్టు టరుదు. రెండుమూడు రకముల నొకేచోట సాగు చేయుచో కాయలు గింజలు ఏర్పడవచ్చును. కాయ లేర్పడుచో 4-6 అరలు గలిగి యుండును. అందు 4-6 గింజలుండును. ఇవి మొఖమల్ వలె మృదువయిన రోమకళ గలిగియుండును. ఆకులందును, కాడలందును కొద్ది గొప్ప ఊదారంగుండు రకములును, అన్ని భాగములును పసరుగ నుండు రకములునుగూడ గలవు.

94వ పటము

(1/4 సైజు)

చిరుగడదుంప వేరుయొక్క పరిణామము. ఇది ఆయా రకములలో పెక్కు ఆకార, పరిమాణ, వర్ణభేదములను గలిగియుండును. ఈ దేశమున పెంచబడు ముఖ్యరకములను యీ క్రింది తరగతులుగ విభజింపవచ్చును.

1. ఎర్రనిడివి దుంపలుగలవి:—ఈ తరగతిలోని దుంపలు యెర్రగనుండు తొక్కలు గలిగి సామాన్యముగ 10-25 సెం. మీ. పొడవును, 2-4 సెం.మీ. లావును గలిగియుండును. దేశవాళీ నిడివిరకపు దుంపలోపలి పిష్టభాగము యించుక పసిమిరంగుతోగూడి యుండును. తీయగ నుండును ఈ తరగతిలో తీపి తక్కువగ నుండు రక మొకటి బెంగుళూరు ప్రాంతము

లందు గలదు. దుంపల రంగునందు లేత ముదురు భేదములుగూడ గాన నగును.

2. ఎఱ్ఱరకురచ దుంపలు గలవి:— ఇవి రంగునందు పై రకమునే బోలియుండును. కాని దుంప పొడవు తగ్గి లావుగ నెదుగును. కొన్నిటిలో పొడవును, లావును కొంచెమించుమించు సమముగ నుండుటగలదు. తీపి మధ్యమము.

95వ పటము



(1/4 సైజు)

3. తెల్లకురుచ దుంపలు గలవి:—ఇవి పైన తెల్లని లేక యించుక పసిమిరంగు తోక్క గలిగి పై రకమును బోలి యుండును. వీనిని కొన్నిచోట్ల మోహన దుంపలనియు తెల్ల దుంపలనియుకూడ యందురు.

4. తెల్లనిడివిదుంపలుగలవి: ఇవి నిడివియందు మొదటి తరగతి దుంపలను బోలియుండును.

పై నాలుగు తరగతుల యందును నంతర్భేదములు గల రకములు కొన్ని యీ దేశము నందును, అమెరికా సంయుక్త రాష్ట్రములు మొదలగు నితరదేశములందును గలవు. న్యూజీలండులో నొకజాతి చిరుగడము (Ipomoea crysorhyza) షుమారు మూడేసి వీసెలుగల దుంపలను బెట్టునట[29]. ఇట్లు హెచ్చు దిగుబడి నిచ్చు విదేశీయపు రకముల నీ దేశము

నందు బరీక్షించి యందుండి శ్రేష్ఠమగు వాని నెంచుట కవకాశముగలదు. మరియు మానవ యత్నముచే సంకరము లను బుట్టించి యందుండి మేలురకముల నెంచుటకుగూడ యవకాశము గలదు. ఈ కృషి అమెరికాలో నిదవరకే ప్రారంభింపబడెను.

భారత కృషి సంస్థవారి రకములు:

పూసా సఫేదు: తెల్లదుంప, కండ తెలుపు, 4-4½ నెలలలో పంటకు వచ్చును.

పుసా సునేరి: కండపచ్చని దుంప, కెరొటీను ఎక్కువగా గలది.

పూసాలాల్: ఎర్రనిచర్మము, తెల్లనికండ. ముందుగ వచ్చు పంట.

V-12: అమెరికానుండి వచ్చిన రకము. 3½-4 మాస ములలో పంట నిచ్చును. తెల్లదుంప. తీపి ఎక్కువ. కాడలు మరీ నేలపైయుండక కొంచెము నిలచియుండును.

V-8: కండె ఆకారపు తెల్లనిదుంపలు. కండ లేత పసిమిరంగు. కాడలు కొంచెము ఎరుపు చాయగ నుండును. 4 నెలలలో పంట నిచ్చును.

చిరుగడము ఉష్ణమండలపు పైరుగ పరిగణింపబడు చున్నను, ఈ ప్రాంతములం దుష్ణత యధికముగ నుండు కాలమున నీ తీగ హెచ్చుగ రొట్టపోయుటచే దుంపలు బాగుగ నూరవు. దీని కధికవర్షమును పనికిరాదు. కావున

వంగ మొదలగు తోలకరి పంటలను పెసర, మినుము, బొబ్బర మొదలగు పయరపంటలను బెట్టుచుండవలెను. వరి మళ్ళలో మూడేండ్ల కొకసారి కంటె తరచు కాకుండ పయర పంటకు బదులు దీనిని పెట్టుచుండవచ్చును.

చిరుగడమును కొంతవరకు ముదిరిన కాడలను సుమారు 25-30 సెం.మీ. ముక్కలుగగోసి నాటి వృద్ధిచేయదగును. దుంపలనుగూడ నాటవచ్చునుగాని మొదటి పద్ధతియే సులు వైనదియు మితవ్యయముతో నగునదియునై యున్నది. ముందుగా అనగా ఆగస్టు - అక్టోబరు నెలలలో నాటుటకు వలయు విత్తనపు కాడను సంపాదించుటకు వెనుకటి వేసవి పైరును అనగా జనవరిలో నాటిన దానిని త్రవ్వినపుడు తీసివేయబడు తీగలను ముక్కలుగ గోసి యెచటనయిన కొద్ది విస్తీర్ణమున ప్రత్యేకముగ విత్తనముకొరకు కొన్ని మళ్ళలోనాటి తొలకరివరకు నీరుకట్టుచు పెంచవలెను. అటు పైన నది వర్షపు పదునుననే పెరిగి అగస్టు-అక్టోబరు కారున నాటుటకు తగిన కాడల నొసగును. ఈ కారున బెంచబడు పైరునుండి లభించు కాడలే డిసెంబరు-జనవరి కారున నాటుట కుపయోగించును.

నేలను బాగుగ దున్ని కొంత సత్తువచేసిన మళ్ళలో విత్తనపు కాడలను పైన చెప్పినట్లు ముక్కలుగ గోసి నాట వలెను. సామాన్యముగ వెనుకటి సస్యమునకు బాగుగ సత్తువ చేసిన నీ సస్యములకు ప్రత్యేకముగ సత్తువచేయ నవసర ముండదు. ఐనను నేల తగినంత సత్తువగ లేదని తోచినపుడు హెక్టేరుకు 25-30 బళ్ళ పశువుల యెరువును, అంతే పెంటను

పోయుట మంచిది. అమెరికాలో హెక్టేరుకు 15 కి. గ్రా. నత్రజనిని; 40 కి. గ్రా. సున్నమును, 50 కి. గ్రా. పొటాషు గల సారదము అనుకూలమని కనిపెట్టబడెను. వర్షాధారపు పైరునకు మళ్ళుగట్టుట యావశ్యకత ముండదు. నాటుటకు ముందు అచ్చటచ్చట 1.80-2.75 మీ. దూరమున ఊట కాల్వలను దీసి ఆ మంటిని మధ్యస్థలములపై సర్ది దానిపై దుంపతీగ ముక్కలను నాటవలెను. నీరుకట్టి సాగుచేయు పైరునకు మళ్ళుగట్టిగాని గట్లు, చాళ్లు ఏర్పరచిగాని నాటవలెను. ఎట్లయినను 45 సెం.మీ. దూరముగల వరుసలలో మొక్కలను 30 సెం. మీ. కొకటి చొప్పున నాటవలెను. గట్లు, చాళ్లు చేయు పద్ధతిలో వానియెత్తు సుమారు 15 సెం. మీ. లుండవలెను. ఉత్తర విశాఖపట్టణపుజిల్లాలో వర్షపు బాధ హెచ్చుగగల కొన్ని యిసుకనేలలలో సుమారు 45 సెం మీ. యెత్తునను 0.90 మీ. దూరమునను నుండు గట్లనువేసి వాని నెత్తిమీద 23 సెం. మీ. కొక తీగ ముక్కను నాటుదురు. 45×30 సెం. మీ. దూరమున నాటుచో హెక్టేరుకు సుమారు 75,000 ముక్కలు పట్టును. 0.90 మీ. దూరపు గట్లపై 23 సెం. మీ. దూరమున నాటుచో 50,000 ముక్కలు పట్టును.

నాటిన కాడలు చిగిర్చి తీగ సాగినకొలదిని పణుపుల నద్ద వేళ్ళుదన్ని యవి దుంపలుగ నేర్పడును. తీగలు నేలను కప్పులోపల నొకటి రెండుసార్లు గొప్పు త్రవ్వి మంటిని కాడలపై జేర్చవలెను. నీరు కట్టు సస్యమునకు తీగ లెదుగు వరకును తరచు నీరు కట్టుచు రావలెను. దుంపలూరుట

మొదలుపెట్టినది మొదలు నీటిపారుదల యెడము చేయవలెను. దుంపలు ముదిరి త్రవ్వబడుటకు ముందు కొంత కాలము నీరుకట్టుట మాని మళ్ళ నారనీయవలెను.

తీగల కొనలు ఒకదానిపైనొకటి ప్రాక నారంభించిన వెనుక సామాన్యముగ నవి క్రొత్తవేళ్ళను దింపవు. కాని పెరకువ మందమయినచోట్ల తీగలు నేలను త్వరలో గ్రమ్మక మొదట దిగిన దుంపలు ముదురు కాలమునకుగూడ చివరి భాగమున వేళ్ళను దింపుచుండును. అట్టిచోట్ల తీగల కొనల నపుడపుడు పైకి లేవదీసి వేళ్ళు దిగకుండా జూడవలెను. లేనిచో నాలస్యముగ దిగిన వేళ్ళు దుంపలుగ మారవు సరిగదా మొదటి దిగినవిగూడ బాగుగ నూరక సన్నగిలి యమ్ముట కనర్హమగును.

పొలములోనూ, త్రవ్వి ఎత్తిన తరువాతనూ దుంపలను దొలుచు కొంకి పురుగు (Cylas formicarius) గలదు. అది కాడలనుకూడ దొలుచును. డింభములు నేలలో నుండుటచే నాటుటకు ముందు హెక్టేరుకు (ఎకరమునకు) 5 కిలో గ్రాముల వంతున హెప్టాక్లోర్ వేసి దున్నవలెను. కాడలను దొలుచు మరియొక పురుగు (Omphisa amastomosalis) గలదు. పై కొంకిపురుగును, దీనినికూడా ఎండ్రిన్ 0.032% చల్లుటచే నివారించగలుగుదురు.

సామాన్యముగ చిరుగడ దుంపలను నాటిన 4 నెలలలో త్రవ్వవచ్చును. మొదట తీగలను గోసివేసి సుమారొక వారమూరుకొని పిమ్మట త్రవ్విన నా దుంపలలోని

పిష్టపదార్థము చక్కెరగ మారి యవి హెచ్చు తీయగ నుండునని కనిపెట్టబడెను[30]. త్రవ్వినపుడు సాధ్యమయినంత వరకు దుంపలకు దెబ్బ తగలకుండ జూడవలెను.

సామాన్యముగ ఎకరకు 100-120 కి. గ్రా. దుంపలూరును. అమెరికాలోను, కొన్ని యితర ప్రదేశములలోను నింతకంటె మూడు నాలుగు రెట్లు దుంపలూరుట గలదు. ఒకచోట హెక్టేరుకు 46900 కి. గ్రా. దుంపలయినట్లు వ్రాయబడి యుండెను.

తోటభూములలో చిరుగడమును సాగుచేయుట కగు వ్యయమును అందువలన రాదగు నాదాయమును అనుబంధము (బ్రూ) లో యంచనా వేయబడెను.

చిరుగడ దుంపలు కంద, పెండలము మొదలగు వాని వలె చాలకాలము నిలువయుండవు. కాని త్రవ్విన వారము పది దినములవరకు నంతగా చెడవు. ఈ కాలములోపల వానిలోని పిష్టపదార్థము కొంత చక్కెరగ మారి దుంపలు మరింత తీయబడును.

చిరుగడ దుంపలను తరచు కర్రపెండలపు దుంపల వలెనే కాల్చి తిందురు. వానికంటె నింపుగను, తీయగను నుండును. దీనిని ముక్కలుగ గోసి యుడికించి కూరగజేయుటయు గలదు. కొందరు చమురులో వేచి తినుటయు గలదు. కాని యీ దుంపలు తీయగ నుండుటచే ఉరలగడ్డవలె నిందులకంత యనుకూలముగావు. ఇట్లు వేచి తినుటకు తీపి తక్కువగ నుండు కొన్ని రకముల దుంపలు తీగ పసరుగ నుండగనే

త్రవ్వితీసిన ననుకూలములు. చిరుగడ దుంపముక్కలు పులుసులో వేసి యుడికించి తినుట కింపుగ నుండును. ఒక కర్ర పెండలము తప్ప తక్కిన దుంపజాతు లన్నిటికంటెను చిరుగడదుంప హెచ్చు పౌష్టికశక్తి గలది. కాని మాంసకృత్తుల పరిమితి మధ్యమము. ఖనిజద్రవ్యముల పరిమితి తక్కువ. బి$_2$ తప్ప తక్కిన విటమినులు తక్కువ. 1-అ, ఆ అనుబంధము లందు దీని సంఘట్టనము తెలుపబడెను. మొత్తముమీద నిది యురలగడ్డ కంతగా దీసిపోదని చెప్పవచ్చును. అంతటను సులువుగ బెరిగి దానికంటె హెచ్చు పుష్టిగల దుంపల నొసగుటచే అధికాహారోత్పత్తికిగాను దీనిని ప్రోత్సహించదగును. ఆయుర్వేదజ్ఞులీ దుంప కొంత గురుత్వము జేసినను పైత్యహరమును, వీర్యవృద్ధికరమును నందురు.

అమెరికా మున్నగు దేశములలో నీ దుంపలనుండి పిండినిదీసి ఇతర జాతుల పిండిల్లో గలిపి రొట్టెలకును, బిస్కట్లకును నుపయోగించుచున్నారు. అమెరికాలో చిరుగడ దుంపలనుండి యొకవిధమగు తేనెపాకము (Syrup) తయారు చేయుటయు కలదు.

చిరుగడ దుంపలను అమెరికాలో పశువులకు, పందులకును గూడ ఆహారముగ నుపయోగింతురు.

చిరుగడ దుంప తీగను పశువులు ఆతురతతో దినును. పాలు గలిగి యుండుట పాడిపశువులకు మంచి యాహారము. దీనిని గురించి 'పశుగ్రాసములు, పచ్చియెరువులు' అను గ్రంథమున విపులముగ వ్రాయబడెను.

## 2. పెండలము

Dioscoria alata - N. O. Dioscriaceae

అరవము - వత్తికిజంగు, హిందీ - రతాలూ; సంస్కృతము - పిండాళుః

స్థూలకదం

పెండలము శ్రేష్ఠమగు దేశీయపు దుంప జాతులలో నొకటి. దీనికి ఆసియా ఖండమందలి యుష్ణభాగము ఆదిమ స్థానమని చెప్పబడుచున్నది. ఇది యిండియా దేశమున చాల భాగములందు సాగు చేయబడుచున్నది. మరియు బర్మా, మలయా, చీనా, జపాను, మోరీసు, న్యూజీలండు మొదలగు దేశములందుగూడ యిది కొద్ది గొప్ప సాగునందున్నది.

పెండలపు తీగ అనుకూల పరిస్థితులందు చాల విరివిగ బ్రాకును. ఆశ్రయమేదేని దొరికినచో దానిని యెడమకు తిరిగి చుట్టుకొని పైకెగబ్రాకును. కాండము నాలుగు (కొన్ని జాతులలో హెచ్చు) రెక్కలు లేక కోణములు దేరియుండును. దీనిక్రింద భూమిలో నిడివియయిన పెద్దదుంప యేర్పడియుండును. దానిపై సన్నని వేళ్లనేకము బయలుదేరును. ఆకులు తమలపాకులను బోలి 12-20 సెం. మీ. వరకు పొడవును, 8 సెం. మీ. వరకు వెడల్పును గలిగి యుండును, తొడిమెలు సెంటిమీటరు పొడవు వరకుండును. పైయాకులు క్రిందివానికంటె చిన్నవిగ నుండును. ఈ తీగ అరుదుగ పూయుచుండును. మగపూవులును, ఆడు పూవులును వేర్వేరు కంకులుగ బయలుదేరును. మగ

96 వ పటము



పెండలము దుంప



పెండలము ఆకు

పూవులలో పుష్పనిచోళము 6 కురుచ తమ్మెలు గలిగి యుండును. 6 కింజల్కములుండును. ఇందు మూడు గొడ్డుపోయి యుండుటయు గలదు. ఆడు పూవులలో పుష్పనిచో

శము 6 దళములుగ చీలియుండును. కాయ 3 అరలు కలిగి మూడు పలకలు దేరియుండు బహువిదారణఫలము. గింజలు అరకు రెండేసి యుండును.

పెండలమునందు పెక్కు జాతులును, రకములును గలవు. అందు ముఖ్యములు :—

1. తెల్ల లేక పెద్ద పెండలము (Dioscoria alata. var. alba):— ఇదియే తెలుగు జిల్లాలలో విరివిగ సాగునందున్నది. దీని దుంప పైబెరడు గీచివేసినచో లోని కండ తెల్లగ నుండును. తీగ 4 రెక్కలు లేక కోణములు దేరి యుండును. ఈ దుంప సామాన్యముగ 1.5-3 కి. గ్రా. వరకూరును. రెండు మూడు సంవత్సరములు త్రవ్వకుండ మరల మరల బెరుగనిచ్చినచో 12-18 కి. గ్రా. వర కూరుట గలదు.

2. ఎర్ర పెండలము (D. Alata. var. rubella) :— ఇదియు పై జాతివలెనే యుండును. కాని లేత దుంపయు ముదుర దుంపయుగూడ పై పొరను గీచివేసినచో లోపలి పొర యెర్రగ నుండును. కాని యీ యెరుపుపొర పలుచగనే యుండును. లోపలి పిష్టపదార్థము తెలుపుగనే యుండును. సామాన్యముగ సాగునందున్న దేశీయపు ఎర్రి పెండలపు రకముగాక యిటీవల కలకత్తా వ్యవసాయక ఉద్యాన సంఘమువారిచే నీ దేశమున ప్రవేశపెట్టబడిన మోరీసు రకము (D. alata. var. Purpurea), మూలాకారము (D. alata. var. attro-purpurea) ను గూడ ప్రశస్తముగ నెంచబడు చున్నవి. ఎర్రి పెండలపు జాతుల తీగ 6 లేక హెచ్చు

రెక్కలు లేక కోణములు దేరియుండును. ఈ జాతులన్నియు గూడ తెల్ల పెండలమువలెనే నిడివియైన పెద్ద దుంపలను బెట్టును. దుంపలు సామాన్యముగ నొంటరిగనే యుండును.

3. కాయ పెండలము (Dioscoria bulbifera) :— ఇందు నేలలోని దుంప యంతగా నెదుగదు. కాని తీగపైన సపోటా రంగుగల కాయలువంటి దుంపలేర్పడును. సామాన్యపు తెల్ల పెండలపు తీగలపై గూడ నిట్టి దుంప అరుదుగ బయలుదేరుటగలదు. ఈజాతి సాగుచేయుట కంతగానర్హము

97 వ పటము





సిరుగడం ఆకు, దుంప (1/2 సైజు)

గాదు. కాని తోటలలో స్వల్పముగ బెంచవచ్చును. దుంపలు కాల్చి తినుట కనుకూలముగను ఇంపుగను నుండును.

4. చిరుపెండలము లేక సిరుగడము (Dioscoria esculenta) :— సిరుగడము అను పేరు చిరుగడముయొక్క అప

భ్రంశమై యుండనోపు. తొలుత నీపేళ్లు గెనుసుగెడ్డకుగాక చిన్నచిన్న దుంపల ననేకములుగ తీగ మొదటబెట్టు నీ జాతి పెండలమునకే వాడబడుచుండినట్లును ఇటీవల విస్తారముగ సాగునకు వచ్చిన గెనుసుగడ్డకు కూడ నివి ప్రజలచే వాడ బడుచున్నట్లు కనబడును. రెంటికిని భేదము స్పష్టమగుటకు సిరుగడమని వ్యవహరింపబడు నీ పెండలమును చిరుపెండల మని వ్యవహరింపదగును. చిరుపెండలపు దుంపలు కొంచె మించుమించు బంగాళాదుంపలవలె 8 - 12 సెం. మీ. పొడవుండును. వానివలెనే మొక్క మొదట గుంపుగ బయలుదేరును. తీగపైనను, దుంపపైనను ముండ్లుండును. కాని దుంపలపై తరచు ముండ్లు లేకపోవుటయు గలదు. ఈ జాతి పెండలపు తీగ 6 రెక్కలు లేక కోణములు గలిగి యుండును. ఆకులు పెద్దపెండలపు ఆకులకంటె చిన్నవి. అంతకంటె నిడివి తక్కువ. 8-12 సెం. మీ. పొడవు మాత్ర ముండును.

కొద్దిగొప్ప సాగునందున్న పైజాతులు గాక దుక్క పెండలపు దుంప, అడవి గెనుసుగడ్డ మొదలగు కొన్ని వన్య జాతులు గూడ పెండలపు గణములో జేరినవేయైయున్నవి. వీనిని గురించి మరియొకచోట వ్రాయబడును.

కర్రపెండల మనబడునది పెండలపుకుటుంబములోనిది కాక చెముడు కుటుంబములో జేరిన యొక దుంపజాతి. దీనిని గురించి మరియొక చోట వ్రాయబడెను.

పెండలము ఉష్ణదేశపుజాతి. కాని కొన్ని జాతులు సమశీతోష్ణ ప్రాంతము లందు గూడ పెరుగుచున్నవి. దీనిని

నాటుటకు ముందొలకరి (ఏప్రిల్-జూన్) అనుకూలమగు కాలము. డిసెంబరు నెలాఖరుకు దుంపలూరును. మరియొక నెలలో బాగుగా ముదురును.

పెండలమునకు నగినంత తేమగ నుండియు నివక చేయని నేల కావలయును. నీరు నిలచిన నీ తీగ చచ్చును. వండలి నేలలు ప్రశస్తము. గోదావరి డెల్టాలోని కొద్దిగొం జిగురుగ నుండు మెరక వండలినేలలందును, ఇతర నదులవల నేర్పడిన గరుపవండలి నేలలందునుగూడ నిది విస్తారముగ సాగుచేయబడుచున్నది. గంజాం జిల్లాలో నిది యిసుకకొండి నేలలందును పెంచబడుచున్నది. ఎఱ్ఱనేలలందలి దుంప రుచిగా నుండును. కాని దిగుబడి తక్కువ.

పెండలమును సామాన్యముగ వంగ, మిర్చి, పసుపు, కంద, జొన్న, చోడి మొదలగువానితో మార్చి పెట్టుదురు. విరివిగ పైరు చేయుచోట్ల నిది ప్రత్యేకముగనే సాగు చేయబడుచున్నది. సామాన్యముగ దీనిని చెఱకు, అరటి, తమల పాకుల తోటల చుట్టును నాటుచుందురు. మెదిమట్టి చెరువు కాల్వగట్లమీద నాటుటయు గలదు.

పెండలపు దుంప నేల యెంత లోతువరకు గుల్లగ నున్న నంత బాగుగ నూరును. ఈదుంప కంద, చేమ మొదలగు వానివలెగాక నిలువుగ క్రింది కెదుగుటచే వానికివలె దీనికి నేలను దున్నిన మాత్రము చాలదు. నల్ల నేలలను లోతుగ బెల్లు విరువదగును. గరుపనేలలను లోతుగ దున్ని 3-4.5 మీ. పొడవును 1.50-1.80 మీ. వెడల్పుగల పెడలుగ విభజించి ప్రతి పెడచుట్టును 30-40 సెం.మీ. వెడ

ల్పును, 30 సెం.మీ. లోతునుగల కాల్వలను త్రవ్వి ఆ మంటిని పెడలపైభోసి మెరక చేయవలెను. వర్షము మెండుగ గురియుచోట్ల గంజాం జిల్లాలోవలె 90-120 సెం.మీ. దూరమున 30-45 సెం. మీ. యెత్తుగల గట్లను దానిమధ్య చాళ్ళను ఏర్పరచి వానిపై సుమారు 0.60 మీ. కొకదుంప ముక్కను నాటవచ్చును. ఇసుకకొడి నేలలో మంటిని అడుగున 0.90-1.20 మీ. వెడల్పుగల గుట్టలుగవేసి వానిపై నాటుట గలదు. ఇట్లు పెడలుగాని, గట్లుగాని, గుట్టలు గాని చేసి నాటుటయొక్క ముఖ్యోద్దేశము నేలను గుల్లగ జేయుటయు; వర్షమువలన యివక తగులకుండ చేయుటయునై యున్నది. కంద ముక్కకంటె పెండలపు తీగ యివకచే నెక్కువ చెడిపోవును. కావుననే జల నిర్గమనమును గురించి మరింత శ్రద్ధ పుచ్చుకొనవలెను.

విత్తనమునకు సామాన్యముగ దుంపల తలలుపయోగింపబడుచుండును. కొందరు దుంప నంతను ముక్కలుగ గోసి యుపయోగింతురు. కాని దుంప పైభాగమున నున్న నిద్రకళ్ళు క్రింది భాగమున నుండవు. కావున క్రింది భాగపు ముక్కలు కొన్ని మొలవకపోవుట గలదు. సామాన్యముగ ప్రతి ముక్కయు 0.25-0.50 కి.గ్రా. బరువు గలిగి యుండవలెను. 1.20 మీ. వరుసలలో 0.60 సెం.మీ. కొకముక్కను నాటుచో ఆరుకు సుమారు 25-50 కి. గ్రా. విత్తనపు దుంపలు పట్టును. దుంపల మొలకచూచి మొలవనిచోట్ల మరల వెంటనే దుంప ముక్కలను (తల ముక్కలను) నాటవలెను. తీగలు పైకి సాగగనే అవి ప్రాకుటకు వెదుళ్ళనుగాని యితర

కొయ్యలనుగాని కంపనుగాని నాటవలెను. కొందరు రెండు వరుసలకు మధ్యగా కంపనునాటి దానిపై నారెండు వరుసల తీగలను నెక్కింతురు. కొన్నిచోట్ల నీ తీగలను నేలపైననే ప్రాకనిత్తురు. కాని యిందువలన వాని యాకులకు తగినంత వెలుతురు తగులక దుంప బాగుగ నూరదు. ప్రతి తీగకున నొక్కొక్క వాసమునాటుచో హెక్టేరుకు సుమారు 12,50( వాసముపట్టును.

తీగలు ప్రాకనారంభించిన వెనుక చేయవలసిన ముఖ్య మగు పనులు కలుపు తీయుటయు, పెడలుగాని గుట్టలుగాని వర్షముచే దిగజారినపుడు ఎగవేయుటయునైయున్నవి. వర్షపు నీరు నిలువలేకుండ ఎప్పటికప్పుడు పోవునట్లు చూచుట మరి యొక ముఖ్యమగు పని.

పెండలపు తోటలకు నీరు కట్టుటరుదు. కాని గరుప నేలలకును ఇసుకకొడి నేలలకును వండలి నేలలందు వర్షము లెగబెట్టు నపుడుగాని, వర్షకాలాంతమునుండి తీగ పండ బారు వరకునుగాని నీరు కట్టవలసియుండును.

తీగ చచ్చిన పిమ్మట దుంపలను మరల తోలకరించు లోపల నెపుడు త్రవ్వినను త్రవ్వవచ్చును. కాని కొందరు తీగ పండబార నారంభింపగనే అనగా దుంపబాగుగ ముదు రక మునుపే త్రవ్వి ముందుగవచ్చు హెచ్చు ధరకు విక్ర యింతురు. కాని దుంప కూరకపుడంత యనుకూలముగ నుం డదు. కాల్వగట్లమీాదను ఇతర తోటల మోరలను పెంచిన దుంపల నా యేడు త్రవ్వక మరుచటి సంవత్సరము మరల

మొలచి పెరుగనిచ్చుటయు గలదు. బాగుగ ముదిరిన దుంపలను ఆరనిచ్చి ఊకలోపెట్టి యుంచినయెడల నంతగా శుష్కించిపోక తొలకరివరకు నిల్వయుండును. పరిస్థితులను బట్టియు నాటిన ముక్కల సైజును బట్టియు దిగుబడి ఆరుకు 200-400 కి. గ్రా. దుంపల వరకుండును.

పెండలము దుంపపై బెరడును త్రిసివేసి ముక్కలుగ గోసి యుడికించి చప్పిడికూరగ వండి తినవచ్చును. తరచు దీనితో బెల్లమును చేర్చుటయు గలదు. పులుసుపెట్టి కూర వండుట యరుదు. కాని యీ ముక్కలను పెద్దవిగ తరిగి అరుదుగ పులుసులో వేయుటయు గలదు. నీటితో ఉడికించుట కంటె దుంపలను కుమ్ములోపెట్టి కాల్చిన హెచ్చు రుచిగా నుండును. దుంపను బంగాళా దుంపలవలె చక్రములుగ తరిగి చమురులో వేచి తినుటకీ దుంప మిగుల ననుకూలముగ నుండును.

పెండలపు దుంప కొంచెమించుమించు ఉరలగడ్డతో సమాన పౌష్టికశక్తి గలది. మాంసకృత్తుల పరిమితియు కొంచెమించు మించు సమానమే. ఖనిజ ద్రవ్యముల విషయముగాని, విటమినులు విషయముగాని తెలియదు. ఆయుర్వేదజ్ఞులీ దుంపకూర గురుత్వముచేసి, శ్లేష్మమును గలిగించు ననియు, మేహమును హరించి వీర్యవృద్ధిని జేయుననియు చెప్పుదురు. దీనినుండి వెలికితీసిన డయాన్‌జనిన్ అనుమందు సంతాన నిరోధమునకు పనికివచ్చునని ఇటీవల కనుగొనిరి.

పెండలము నొక యెకరమున సాగుచేయుటకగువ్యయ మును అందువలన రాదగు నాదాయమును అనుబంధము 2 (ఇ) లో యంచనా వేయబడెను.

చిరుపెండలము పెండలమువలెనే తొలకరిలో నాట బడును. సత్తువయిన లేక తగినంత యెరువువేసిన యిసుక గరుములు దీని కనుకూలములు. ఇవక నేలలు పనికిరావు దీని దుంపలు పెద్ద పెండలపు దుంపలంత లోతుగ దిగక పై భాగముననే యూరుటచే నేలను బాగుగ దున్ని మళ్ళుగట్టి గాని, గట్లు, చాళ్ళు యేర్పరచిగాని దుంపలను నాటవచ్చును మళ్ళలో సుమారు 0.45 సెం. మీ కొకదుంప చొప్పునగాని, 0-60 సెం. మీ. దూరపు గట్లపై అడుగున కొక దుంప చొప్పునగాని నాటవలెను. ఆరుకు సుమారు 10-15 కి.గ్రా దుంపలు పట్టును. వర్షపుపదును చాలదని తోచినప్పుడెల్ల నీరు కట్టుట మంచిది. తీగ పెరుగ నారంభించిన వెనుక అప్పు డప్పుడు రెండు మూడుసార్లు గొప్పుత్రవ్వి కలుపుతీసి మంటిని మొక్కల మొదటికి త్రోయవలెను. తీగలు ప్రాకుట కేదేని కంప వేయవలెను. నాలుగేసి తీగలకొక వెదురు చొప్పున నాటుటయు గలదు. జూన్‌లో నాటిన మళ్ళలో డిసెంబరునాటికి దుంపలూరును. అప్పటికి ఆకులు పండ బారును. సామాన్యముగ ప్రతి తీగయు 3-6 దుంపలను బెట్టును. అనుకూల పరిస్థితులలో ఆరుకు 80-100 కిలోల దుంపలూరును.

చిరుపెండలపు దుంప ఉరలగడ్డ దుంపవలె మృదు వయిన పిష్టపదార్థము గలిగి యుడికిన వెనుక జలజలలాడుచు

విడుచుండును. ఉరలగడ్డవలెనే పలువిధముల నుపయోగింప వచ్చును. పెండలపు కాయలవలె కాల్చి తినవచ్చును. సంఘట్టనమునుగూర్చి తెలియదు.

## 3. వన్యజాతులు

1. దుక్క పెండలము (Dioscoria pentaphylla) :- దీనికి అడవి గెనుసుగడ్డ యనికూడ పేరు. ఇది తెలుగు జిల్లాలో 120 మీ. యున్నతము వరకు గల యడవి ప్రదేశములలో పెరుగుచున్నది. పూవులు ఆకు పసరు రంగు గలిగి పరిమళముతో నుండును. దుంప నిడివిగ నుండును. ఈ జాతి దుంపలు లభించుచోట్ల నుడకబెట్టి లేక కాల్చి తినబడుచున్నవి.

2. పులిదుంప (Dioscoria hispida) :- అడవులలో స్వతస్సిద్ధముగ లభించు నీజాతి దుంపలు సంప్రాప్తము లయినపుడు కాల్చి లేక ఉడుకబెట్టబడి ఆహారముగ నుపయోగింపబడుట గలదు. ఇందు విషయుక్తమయిన దుంపలుగల రకముగూడ గలదందురు.

3. పిల్లిపీచర లేక శతావరీ (Asparagus racemosus N. O. Lilaceae) :- ఇది బంజరు భూములందు ముఖ్యముగ పుట్టలపైనను, తోటల కట్టవ లందును స్వతస్సిద్ధముగ బెరుగుచుండు గుల్మిని. మొక్క మొదటినుండి భూమిలోనికి 30-60 సెం.మీ. పొడవుగల తేగలవంటి బోళ్లుదిగును. వీనినే పిల్లి తేగలందురు. కాండము అనేక శాఖలుగలిగి 1-1.5 మీ. వరకు వ్యాపించుచుండును. కాండములందు వాడియయిన

చిన్న ముండ్లుండును. ఆకులు సీమపిల్లిపీచరలో వలెనే శాఖా పరిణామములు. సన్నగ చీలియుండును. పిల్లితేగలను అల్లము, మామిడల్లమువలె తరిగి యూరవేసి తినుటయు, మురబ్బాచేసి నిల్వయుంచి తినుటయుగలదు. ఎండబెట్టిన చూర్ణమును, పచ్చితేగల రసమును, కషాయమును వైద్యమున పలువిధముల నుపయోగింపబడును. ఈ మొక్కలను ఉద్యాన వనములలో రమ్యతకొరకు గోలెములలోబెట్టి పెంచుటయు గలదు. ఇట్లు పెంచుటకు తగిన నాజూకైన పెక్కు రకములు గలవు.

# 1 వ అనుబంధము

## అ. కొన్ని ముఖ్యమగు కూరజాతుల సంఘటనమును తెలుపు పట్టిక.[2]*

### 1. కాయగూరలు, గింజకూరలు.

| జాతి | తేమ | ఖనిజములు | మాంసకృత్తులు | చమురు | నార పదార్థములు | కర్బనోదజనితములు | పోషకశక్తి |
|---|---|---|---|---|---|---|---|
| వంగ | 91.49 | 0.50 | 1.31అ | 0.26 | — | 6.44 | 32 |
| సీమవంగ | 92.81 | 0.68 | 1.88 | 0.06 | — | 4,57 | 25 |
| పచ్చిమిర్చి | 82.60 | 1.04 | 2.87 | 0.59 | 6.73 | 6.17 | 43 |
| బెండ | 87.95 | 0.74 | 2.20ఆ | 0.20 | 1.15 | 7.76 | 43 |
| గోరుచిక్కుడు | 82.45 | 1.35 | 3.67 | 0.17 | 2.26 | 10.10 | 56 |
| మొక్క చిక్కుడు | 91.43 | 0.53 | 1.74 | 0.11 | 1.80 | 4.89 | 25 |
| లైమాచిక్కుడు గింజలు | 73.75 | 0.94 | 8.[illegible]8 | 0.27 | — | 16.76 | 104 |
| బీర | 95.43 | 0.34 | 0.52 | 0.12 | — | 3.59 | 18 |
| ఆనప | 96.35 | 0.49 | 0.16 | 0.14 | — | 2.87 | 14 |
| గుమ్మడి | 92.60 | 0.58 | 1.36 | 0.07 | — | 5.[illegible]8 | 28 |
| సీమగుమ్మడి | 94.84 | 0.27 | 0.48 | 0.09 | — | 4.32 | 22 |

అ. ఇందు నూటికి 74 వంతులు మానవ శరీరమున వంటబట్టును.
ఆ ,, 82 ,, ,,

* అన్నియు పచ్చిబరువున శాతముగ నివ్వబడినవి. పౌష్టికశక్తి 100 గ్రాములకు కాలరీలలో నివ్వబడినది.

| జాతి | తేమ | ఖనిజములు | మాంసకృత్తులు | చమురు | నార పదార్థములు | కర్బనోదజనితములు | పోషకశక్తి |
|---|---|---|---|---|---|---|---|
| బూడిదగుమ్మడి | 96.01 | 0,34 | 0.41 | 0.06 | — | 3.18 | 14 |
| ములుదోస | 96.42 | 0.31 | 0.45 | 0.06 | — | 2.76 | 1 |
| పొట్ల | 94.06 | 0.70 | 0.46 | 0,31 | — | 4.47 | |
| దొండ | 93.07 | 0.46 | 1.17 | 0.10 | 1.56 | 3.64 | |
| కాకర | 92.39 | 0.76 | 1.64 | 0.15 | 0.80 | 4.26 | 2[illegible] |
| ,, (పొట్టి) | 83.16 | 1.43 | 2.87 | 0.97 | 1.70 | 9.86 | 64 |
| చౌచౌ | 92.53 | 0.41 | 0.70 | 0.11 | — | 6.25 | 28 |
| టిండా | 93.50 | 0.50 | 1.40 | 0.20 | 1.00 | 3.4 | 21 |
| పనసకాయ | | | | | | | |
| (లేతది) | 84.01 | 1.76 | 0,83 | 0.20 | — | 3.54 | 50 |
| పనసగింజలు | 51.60 | 1.54 | 6.60 | 0.36 | 1.45 | 38.45 | 190 |
| అప్పాల | | | | | | | |
| చిక్కుడు | 82.41 | 0.98 | 4.49 | 0.12 | 2.02 | 9.98 | 56 |
| ఒకరకము | | | | | | | |
| పెసరచిక్కుడు | 88.49 | 0.58 | 2.44 | 0.18 | 2.10 | 6.21 | 36 |
| ఉస్తికాయ | 74.00 | 1.70 | 2.77 | 0.55 | 5.86 | 18.37 | 125 |
| వాకుడుకాయ | 75.50 | 1.57 | 3.09 | 0.77 | 14.15 | 4.90 | 39 |
| బుడమ[32] | 89.10 | 1.31 | 2.00 | 1.99 | 2.93 | 2.67 | 46 |
| అరటి(కూర) | 83.24 | 0.51 | 1.41 | 0.23 | — | 14.61 | 104 |
| మునగకాయ | 86.88 | 1.96 | 2.53 | 0.11 | 4.30 | 3.32 | 25 |
| మామిడికాయ | | | | | | | |
| పచ్చిది | 90.08 | 0.37 | 0.65 | 0.11 | — | 8.81 | 39 |

## II. ఆకుకూరలు, కాడకూరలు, పూవుకూరలు.

| జాతి | తేమ | ఖనిజములు | మాంసకృత్తులు | చమురు | నార పదార్థములు | కర్బనోదజనితములు | పోషకశక్తి |
|---|---|---|---|---|---|---|---|
| తోటకూర | 85.78 | 3.05 | | | | | |
| లేత తోటకూర | | | | | | | |
| కాడ | 12.49 | 1.84 | 0.85 | 0.11 | 1.20 | 3.51 | 18 |
| గోంగూర | 86.22 | 1.02 | 1.70 | 1.07 | — | 9.99 | 56 |
| మట్టుబచ్చలి | 91.66 | 1.50 | 1.92 | 0.85 | — | 4.07 | 32 |
| మెంతికూర | 81.78 | 1.57 | 4.86 | 0.56 | 1.04 | 9.89 | 68 |
| గోబి | 90.20 | 0.61 | 1.75అ | 0.11 | 0.95 | 6.38 | 32 |
| పూగోబి | 89.48 | 1.36 | 3.51 | 0 41 | — | 5. 9 | 39 |
| లెట్యూస | 92.94 | 1.18 | 2.05 | 0.26 | 0.58 | 3.04 | 18 |
| బింతఆర్టిచోక్ | 77.27 | 1.75 | 3.64 | 0.14 | 1.20 | 15.99 | 83 |
| సెలరీ | 81.27 | 2.11 | 5.97 | 0,61 | 1.42 | 8.82 | 64 |
| ,, తొడిమెలు | 93.53 | 0.89 | 0.79 | 0.69 | 1.17 | 3.58 | 28 |
| కొత్తిమిరి | 87.90 | 1.65 | 3.29 | 0.64 | — | 6.52 | 46 |
| ఉల్లికోళ్లు | 87.64 | 0.77 | 0.94 | 0.24 | 1.60 | 8.81 | 43 |

అ. ఇందు నూటికి 72 వంతులు మానవ శరీరమున వంటబట్టును.

ఆ. ,, 76 ,, ,,

| జాతి | తేమ | ఖనిజములు | మాంసకృత్తులు | చమురు | నార పదార్థములు | కర్బనోద జనితములు | పోషకశక్తి |
|---|---|---|---|---|---|---|---|
| చేమ ఆకుల | | | | | | | |
| కాడలు | 93.44 | 1.20 | 0.34 | 0.34 | 0.59 | 4.09 | 2 |
| కామంచికూర | 82.12 | 2.13 | 5.86 | 1.00 | — | 8.69 | 6 |
| బచ్చలికాడ | 93.37 | 1.82 | 0.87 | 0.14 | — | 8.80 | 22 |
| పుదీనా | 82.99 | 1.56 | 4.81 | 0.59 | [illegible] | 8.10 | 56 |
| తమలపాకులు | 85.41 | 2.25 | 3.07 | 0.50 | 2.33 | 6.14 | 43 |
| ముండ్లతోట | | | | | | | |
| కూర | 85.00 | 3.61 | 3.00 | 0.25 | — | 8.14 | 46 |
| తూటికూర | 90.33 | 2.11 | 2.90ఇ | 0.40 | — | 4.26 | 32 |
| తూటికాడలు | 93.67 | 1.76 | 0.83 | 0.20 | — | 3.54 | 18 |
| వెదురుబోడు | 87.06 | 1.40 | 3.02 | 0.09 | — | 7.53 | 46 |
| అవిసెకూర | 76.73 | 3.11 | 8.40 | 1.39 | 2.17 | 11.80 | 94 |
| మునగకూర | 74.98 | 2.27 | 6.65 | 1.73 | 0.87 | 13.50 | 97 |
| అరటిపూవు | 90.22 | 1.21 | 1.45 | 0.19 | 1.93 | 5.00 | 28 |
| అరటిదూట | 88.26 | 0.61 | 0.48 | .005 | 0.76 | 9.84 | 43 |
| కరివేపాకు | 66.81 | 4.17 | 6.11 | 1.04 | 6.37 | 16.00 | 97 |

ఇ. ఇందు నూటికి 67 వంతులు మానవ శరీరమున వంటబట్టును.

ఈ. ,, 41 ,, ,,

III. దుంపకూరలు

| జాతి | తేమ | ఖనిజములు | మాంసకృత్తులు | చమురు | నార పదార్థములు | శర్కరోదజనితములు | పోషకశక్తి |
|---|---|---|---|---|---|---|---|
| చేమ | 73.05 | 1.72 | 2.95 | 0.10 | — | 22.18 | 108 |
| కంద | 69.90 | 1.55 | 1.41 | 0.09 | — | 28.46 | 122 |
| తీయకంద | 78.79 | 0.82 | 1.24 | 0.02 | 0.80 | 18.33 | 78 |
| బంగాళాదుంప | 74.73 | 0.61 | 1.73అ | 0.13 | — | 22.80 | 100 |
| కర్రపెండలం | 59.37 | 0.98 | 0.68 | 0.20 | — | 38.77 | 157 |
| ఉల్లి–పెద్దగడ్డ | 86.76 | 0.36 | 1.22 | 0.004 | — | 11.62 | 50 |
| ,, చిన్నది | 84.33 | 0.55 | 1.80 | 0.08 | — | 13.24 | 60 |
| అల్లము | 80.86 | 1.99 | 2.83 | 0.94 | 2.42 | 12.26 | 68 |
| ముల్లంగి(తెలుపు) | 94.4. | 0.58 | 0.70 | 0.06 | — | 4.25 | 22 |
| ,, (ఎరుపు) | 90.76 | 0.85 | 0.61 | 0.32 | — | 7.46 | 36 |
| దుంప ఆవ లేక టర్నిప్ | 91.10 | 0.60 | 0.52 | 0.23 | — | 7.52 | 39 |
| దుంపగోబి లేక నూలుకోలు | 924.10 | 0.65 | 1.07 | 0.20 | — | 5.98 | 22 |
| గాజర | 86.00 | 1.68 | 0.92 | 0.07 | 1.68 | 10.75 | 46 |
| బీటుదుంప లేక దుంపబచ్చలి | 83.81 | 0.75 | 1.65 | 0.05 | — | 13.74 | 60 |
| చిరుగడం | 66.51 | 1.04 | 1.24ఆ | 0.32 | — | 30.89 | 310 |
| పెండలము | — | — | 1.79 | 0.21 | — | 22.2 | 97 |

అ. ఇందు నూటికి 67 వంతులు మానవ శరీరమున వంటబట్టును.

ఆ. ,, 72 ,, ,,

## ఆ. ఆయా కూరదినుసు లందలి ఖనిజములయొక్కయు విటమినులయొక్కయు పరిమితిని దెలుపు పట్టిక.

### I. కాయగూరలు, గింజకూరలు.

| జాతి | ఖటికము | స్ఫురము | ఇనుము | విటమినులు | | | |
|---|---|---|---|---|---|---|---|
| | నూరుగ్రాముల పచ్చికూరలో మిల్లిగ్రాములలో | | | ఎ* | బి₁* | బి₂ | |
| | | | | మి.గ్రా/100 గ్ర | | | |
| వంగ | 24 | 64 | 1.31 | 5 | .. | మ | 22.5 |
| సీమవంగ | 16 | 39 | 2.37 | 320 | 23 | .... | 31.3 |
| పచ్చిమిర్చి | 29 | 79 | 1.31 | 454 | .. | .... | 111.0 |
| బెండ | 94 | 78 | 1.54 | 58 | 21 | మ | 15.6 |
| గోరుచిక్కుడు | 129 | 51 | 5.76 | 330 | .. | .... | 49.4 |
| మొక్కచిక్కుడు | 48 | 25 | 1.67 | 221 | 26 | .... | 13.8 |
| బీర | 35 | 40 | 1.58 | .56 | 22 | .... | .... |
| ఆనప | 15 | 03 | 0.69 | అ.స్వ | .... | .... | .... |
| తీయగుమ్మడి | 9 | 30 | 0.67 | 84 | 20 | .... | 2.0 |
| సీమగుమ్మడి | 2 | 26 | 0.63 | అ.స్వ | .... | .... | 17.8 |
| బూడిదగుమ్మడి | 25 | 17 | 0.45 | అ.స్వ | .... | 21 | 0.9 |
| ములుదోస | 12 | 25 | 1.48 | అ.స్వ | 30 | 21 | 6.9 |
| పొట్ల | 45 | 24 | 1.23 | 160 | .... | .... | అ.స్వ |

* అంతర్జాతీయపు ఒంట్లు.

నోటు:—స్వ=స్వల్పము; అ.స్వ=అతిస్వల్పము; మ=మధ్యమము; హె=హెచ్చు;....= పరీక్షింపబడలేదు.

| జాతి | ఖటికము | స్ఫురము | ఇనుము | విటమినులు ఎ | బి1 | బి2 | సి |
|---|---|---|---|---|---|---|---|
| | 100 గ్రా.కు మిల్లిగ్రాములు | | | మి.గ్రా/1000 గ్రా. | | | |
| [illegible] | 16 | 91 | 1.21 | .... | .... | .... | .... |
| కంచికాయ | 23 | 65 | 2.22 | 21[illegible] | 24 | స్వ | 88.4 |
| [illegible]కాయ | 45 | 144 | 9.35 | 210 | 24 | స్వ | 88.4 |
| [illegible] | 25 | 24 | 9.0 | 23 | 12 | .... | 18.0 |
| పనసకాయ రేకలు | 26 | 43 | 1.66 | .... | .... | .... | .... |
| పనసగింజలు | 49 | 133 | 0.16 | .... | .... | .... | .... |
| [illegible]చిక్కుడు | 45 | 55 | 1.61 | .... | .... | .... | 12.2 |
| ఒకరకము పెసర చిక్కుడు | 35 | 39 | 1.24 | .... | .... | .... | 27.7 |
| [illegible]కాయ | 123 | 60 | 7.41 | 250 | .... | .... | .... |
| వాకుడుకాయ | 100 | 91 | 1.22 | .... | .... | .... | .... |
| [illegible][32] | 45 | 33 | .. | .. | .. | .. | .. |
| [illegible] | 5 | 27 | 0.60 | 50 | 15 | హె | 23.9 |
| కొబ్బరినగము ముదిరినది | 13 | 213 | 1.70 | స్వ | స్వ | అ.స్వ | 0.8 |
| మామిడికాయ (పచ్చిది) | 12 | 17 | 4.48 | 150 | .. | .. | 3.2 |

## II. ఆకుకూరలు, కాడకూరలు, పూవుకూరలు.

| జాతి | ఖటికము | స్ఫురము | ఇనుము | విటమినులు ఎ* | బి$_1$* | బి$_2$ | సి |
|---|---|---|---|---|---|---|---|
| | నూరుగ్రాముల పచ్చికూరలో మిల్లిగ్రాములలో | | | మి.గ్రా/100 గ్రా | | | |
| తోటకూర | 500 | 100 | 21.40 | 2500–1100 | 29 | మ | 172 |
| తోటకూరకాడ | 263 | 34 | 1.80 | .. | .. | .. | .. |
| గోంగూర | 181 | 38 | 5.38 | .. | .. | .. | .. |
| మట్టుబచ్చలి | 61 | 10 | 4.95 | 2630–3000 | 70 | .. | 47.7 |
| మెంతికూర | 472 | 47 | 16.90 | 3860 | .. | .. | .. |
| గోబి | 34 | 46 | 0.76 | 2000 | 50 | .. | 124.2 |
| పూగోబి | 34 | 61 | 1.25 | 38 | 110 | .. | 65.8 |
| లెట్యూసు | 51 | 30 | 2.39 | 2200 | 90 | .. | 14.9 |
| బంతిఆర్టిచోక్ | 120 | 101 | 2.29 | .. | 75 | .. | అ.స్వ. |
| సెలరీ | 226 | 137 | 6.25 | 5760–7470 | అ.స్వ | .. | 62.4 |
| ,, తొడిమెలు | 33 | 38 | 4.76 | .. | .. | .. | 5.7 |
| కొత్తిమిరి | 137 | 88 | 9.97 | 12630 | .. | హె | 135.2 |
| ఉల్లికోళ్లు | 48 | 54 | 7.50 | .. | .. | .. | .. |
| చేమఆకుతొడిమెలు | 62 | 24 | 0.50 | .. | .. | .. | .. |

| జాతి | ఖటికము | స్ఫురము | ఇనుము | విటమినులు | | | |
|---|---|---|---|---|---|---|---|
| | 100 గ్రా.కు మిల్లిగ్రాములు | | | ఎ | బి $_1$ | బి $_2$ | సి |
| | | | | మి.గ్రా/1000 గ్రా. | | | |
| కామంచికూర | 410 | 74 | 20.51 | .. | .. | .. | 11,3 |
| బచ్చలికాడ | 90 | 15 | 1.34 | .. | .. | .. | 2.9 |
| పుదీనా | 204 | 77 | 15.56 | 2700 | .. | .. | .. |
| ముండ్ల తోటకూర | 800 | 52 | 22.91 | .. | .. | .. | .. |
| తూటికూర | 113 | 48 | 3.90 | 3270 | .. | 29 | 137.1 |
| తూటికాడ | 81 | 27 | 0.78 | .. | .. | .. | .. |
| వెదురుబోడు | 16 | 88 | 0.11 | అ.స్వ | .. | .. | .. |
| అవిసెకూర | 1.131 | 77 | 3.91 | .. | .. | .. | .. |
| మునగకూర | 437 | 71 | 7.00 | 11330 | .. | .. | .. |
| అరటిపూవు | 34 | 48 | 0.12 | .. | .. | .. | .. |
| అరటిదూట | 9 | 5 | 1.06 | .. | .. | .. | .. |
| కరివేపాకు | 811 | 57 | 3.09 | 12600 | .. | హె | 4.2 |

III. దుంపకూరలు :

| జాతి | ఖటికము | స్ఫురము | ఇనుము | విటమినులు | | | |
|---|---|---|---|---|---|---|---|
| | 100 గ్రా.కు మిల్లిగ్రాములు | | | ఎ | బి$_2$ | బి$_1$ | సి |
| | | | | మి.గ్రా. 1100 గ్రా. | | | |
| చేమ | 38 | 143 | 2.13 | 40 | .. | మ | అ |
| కంద | 61 | 16 | 1.30 | .. | 24 | .. | |
| తియకంద | 46 | 22 | 0.62 | 434 | .. | హె | [illegible] |
| ఉరలగడ్డ | 4 | 34 | 0.68 | 40 | 40 | హె | 1[illegible] |
| క్రరపెండలం | 45 | 39 | 0.92 | .. | .. | .. | .. |
| ఉల్లి (పెద్దగడ్డల రకము) | 176 | 46 | 0.66 | .. | 40 | .. | 10.5 |
| ఉల్లి (చిన్నగడ్డల రకము) | 40 | 58 | 1.18 | 25 | 40 | .. | 10.5 |
| ముల్లంగి (తెలుపు) | 54 | 25 | 0.40 | 3 | 60 | .. | 15.0 |
| ,, (యెరుపు) | 46 | 17 | 3 | 60 | .. | .. | 16.9 |
| దుంపఆవ లేక టర్నిప్ | 28 | 35 | 0.42 | అ.స్వ | 40 | .. | 43.4 |
| దుంపగోబి లేక నూలుకోలు | 23 | 35 | 0.35 | 0.40 | .. | .. | 84.5 |
| గాజర | 82 | 30 | 1.52 | 2002 | 60 | .. | 2.5 |
| దుంపబచ్చలి లేక బీటుదుంప | 195 | 57 | 0.98 | .. | 70 | .. | 88.0 |
| చిరుగడం | 17 | 50 | 0.79 | 10 | .. | హె | 24.0 |
| పెండలము | .. | .. | .. | .. | .. | మ | .. |

# 2 వ అనుబంధము

## ఆయా కూరదినుసు సేద్యముల ఆదాయ వ్యయములు

0.40 హెక్టేరు(ఎకరము) భూమిలో ఆయా కూర దినుసులను పండించుట కగు ఆదాయ వ్యయముల అంచనా లీ అనుబంధమున నీయబడినవి. ఈ అంకెల సేకరణ గుంటూరు, కృష్ణాజిల్లాల రైతులనుండి జరిగినందున ఇంతకు పూర్వం నాడుకలోనున్న కొలమానములలోనే వివరముల నివ్వడమైనది. వీనిని మెట్రిక్ తూకమ లలో నిచ్చుట కవకాశము కలుగలేదు. తదుపరి ముద్రణములో ఈ పనిని చేయవచ్చునను తలంపుతో లోగడ శ్రీ పాతూరి రాధాకృష్ణమూర్తి గారు మాకు సేకరించి యిచ్చిన లెక్కలను యథాతథముగ దిగువ నిచ్చుచున్నాము. ఈ పుస్తకము తొలి కూర్పులో గ్రంథకర్త 10 కూరదినుసుల లెక్కలు మాత్ర మిచ్చినారు. దీనిలో మరి ఆరింటి లెక్కలను చేర్చడమైనది. వీని వివరాలు విషయసూచికలో చూడవచ్చును.

### వంగ-తొలకరిపంట

వ్యయము :

నారుమడి 2 సెంట్లు

| | | |
|---|---|---|
| మార్చి | పశువుల యెరువు 10 పల్లికలు | రు. 2.00 |
| | మడి తిరుగగొట్టి బాగుచేసి మళ్లు కట్టుటకు కూలి 2 పు. | 4.00 |
| | విత్తులు 4 గిద్దలు | |
| ఏప్రిల్ | విత్తులు చల్లుట, నీరు పెట్టుట, కలుపుతీత, వగైరా ఖర్చులు | 20.00 |
| | | రు. 38.00 |

| | | |
|---|---|---|
| | | రు. 38.00 |
| | తెగుళ్ల నివారణకు మందులు, కూలి వగైరా | రు. 4.00 |
| | అమోనియం సల్ఫేటు 3 పౌ. | 0.50 |
| | పశువుల యెరువు 20 బండ్లు | 160.00 |
| మార్చి-ఏప్రిల్ | దుక్కి 4 చాళ్లు | 40. |
| మే | చాళ్ళ తోలకం 3 అ. అ. దూరం | 6. |
| | పాదులు కొట్టుటకు కూలి 2 పు. | |
| | నీటి పోత 6 పు. ½ రోజు | 6. |
| | సాయంత్రం నాటుటకు 14 స్త్రీలు | 7.00 |
| | నాటిన తర్వాత పై పోతకు వర్షం కురియు వరకు 10 సార్లు 60 పు. ½ రోజు | 60.00 |
| జూన్ - జులై | కలుపు 3 సార్లు 30 స్త్రీలు | 22.50 |
| | నాగలి పై పాటు | 10.00 |
| జులై | దోరెములు చేయుటకు 8 పు. | 16.00 |
| | నాటి నప్పటినుండి 15 రోజులకు కీటక నివారణ మందులు 10 సార్లు | 100.00 |
| | స్ప్రేయర్ కూలీలు | 30.00 |
| | నాటిన నెలకు పిండి యెరువు 4 బస్తాలు | 120.00 |
| | అమ్మోనియం సల్ఫేటు 3 బస్తాలు (220 పౌ.లవి) | 120.00 |
| | కాయకోత కూలీలు 100 పు. ½ రో. | 100.00 |
| | తోట పీకి పోగువేత 8 పు. | 16.00 |
| | కవులు | 300.00 |
| | మొత్తం రు. | 1160.00 |

రాబడి:

రు. 2250 1500 మణుగుల కాయ మ. 1కి రు. 1.50 న. పై. చొ॥
రు. 1160 ఖర్చు
రు. 1090 నికరాదాయము

## శీతకాలపు పంట

ఈ పంటకూడ పునాస పంటకువలెనే నారుమడి ఖర్చులు, యెరువు ఖర్చులు సమానముగనే యుండును. కాని తెగుళ్ళ నివారణకు రు. 40-00 ల వరకు అదనముగ ఖర్చగును. నీటి తడుపు, మోటారు పంపు సెట్టుక్రింద రు. 60-00, ఏతమైన రు. 200-00 ఎక్కువ ఖర్చయినప్పటికిని ఈ ఋతువులో వచ్చు పంటకు వెల అధికముగ నుండుటచే అదనపు ఖర్చులు పోను నికరాదాయము తొలకరిపంటకంటె మిగుల వచ్చును.

## నీటివంగ-రెండవ పంటగ పయర కారున (వరిమళ్ళలో)

పయరపంటకు శీతాకాలపు పంటకువలెనే నారు పెంపకము, ఎరువువేత ఖర్చులు సరిపోవచ్చును. ఈ కారు పంటకు కలుపు చాల తక్కువ. రెండవపంట యగుటచే కవులుకూడ తక్కువ. నీటి తడుపుకు మాత్రము పైసాగు కంటె అదనముగ ఖర్చగును. 3 కారులలోను పండించు పంటలకు నికరాదాయము దాదాపు స్వల్ప తేడాతో సరిపుచ్చుకొనవచ్చును. అయితే ఆ యా కారులయందు ముఖ్యముగ జులై నారు-అప్పటి వాతావరణపు అనుకూలతనుబట్టి పెద్ద వ్యత్యాసములు కూడ నికరాదాయములో రావచ్చును.

## (అ) బెండ - పునాసపంట (పసుపు ఏవిలిలో)

వ్యయము :

| | | |
|---|---|---|
| మే | దుక్కి రెండుసార్లు | రు. 20.00 |
| | గుంటక 4 సార్లు | |
| | గడ్డలు పగులగొట్టుటకు 4 స్త్రీలు | |
| | విత్తులు 2½ మానికలు | |
| | మినుములు 2 మానికలు | |
| | 20 అం. చతురం పాదులుచేయుటకు 5 పు. | |
| మే 15 | విత్తులు పెట్టుటకు 5 స్త్రీలు | 5.00 |
| జూన్-జులై | కలుపు 20 స్త్రీలు | 15.00 |
| జూన్ 15 | వేరుసెనగ పిండి 4 బస్తాలు | 120.00 |
| | పాదులకు ఎరువువేత 4 పు | 8.00 |
| | వర్షము లేనిచో నీటి తడుపుకు కరెంటు క్రింద | 6.00 |
| | అమోనియంసల్ఫేటు 2 బస్తాలు (220 పౌ.లవి) | 80.00 |
| | పాదులకు అమోనియా వేత 4 పు. | 8.00 |
| | కీటక నివారణ మందులు, స్ప్రేయింగ్ కూలి | 60.00 |
| | కాయకోత కూలి | 125.00 |
| | కంప పీకుడు 5 పు. | 10.00 |
| | కవులు | 300.00 |
| | మొత్తం | రు. 817.50 |

రాబడి :

రు. 1500.00 కాయ 500 మణుగులు మ. 1కి రు. 3.00 చొ॥

రు. 817.50 ఖర్చు

682.50 నికరాదాయము

## పయరపంట (వరిమళ్ళలో)

వ్యయము :

| | | |
|---|---|---|
| డిసెంబరు | దుక్కి 5 చాళ్లు | 50.00 |
| | గడ్డలు నలుగ గొట్టుటకు 4 పు. | 8.00 |
| | 16×12 అం. పాదులుచేయుటకు 4 పు. | 8.00 |
| | విత్తులు 2½ మా. | 40.00 |
| | మినుములు 2 మా. | 2.50 |
| జనవరి 15 | విత్తులు నాటుటకు 8 స్త్రీలు | 8.00 |
| | కాలువలు చేయుట వగైరా 5 పు. | 10.00 |
| | నీటి తడుపు కరెంటుక్రింద | 160.00 |
| | కూలి 1 పు. | 2.00 |
| | కలుపుతీత 10 స్త్రీలు | 7.50 |
| ఫిబ్రవరి 15 | వేరుసెనగ పిండి 3 బస్తాలు | 90.00 |
| | అమోనియా సల్ఫేటు 1½ బస్తా | 60.00 |
| | కీటక నివారణ మందులు | 60 00 |
| | కూలీలు 36 పు. ½ రోజు | 36.00 |
| | నీటి తడుపు 5 సార్లు కరెంటుక్రింద | 10.00 |
| | కూలీలు 5 పు. | 10.00 |
| | కాయ కోత | 125.00 |
| | కంప పీకుడు 5 పు | 10.00 |
| | కవ్వులు | 200.00 |
| | మొత్తం | రు. 897.00 |

రాబడి :

రు. 1200.00 కాయ 600 మణుగులు మ. 1కి రు. 2.00 చొ॥

రు. 897.00 ఖర్చు

రు. 303.00 నికరాదాయము

# బెండ, దోస మిశ్రమము (పసుపు ఏవిలిలో)

వ్యయము :

| | |
|---|---|
| దుక్కి 2 సార్లు | రు. 20.00 |
| 1 1/4 గ. దూరం చాళ్ల తోలకం | 5 |
| బెండ విత్తులు 1 మానిక | 32 |
| దోస విత్తులు 2 గిద్దలు | 4 |
| విత్తులు పెట్టుటకు కూలి 10 స్త్రీలు (చాలుకు 1 వైపు బెండ 2 వ వైపు దోస) | 10,00 |
| నీటి తడుపు 8 సార్లు కరెంటు క్రింద | 9.00 |
| కూలీలు 3 పు. | 16.00 |
| కలుపు 3 సార్లు 30 స్త్రీలు | 22.50 |
| కీటక నివారణ మందులు | 30.00 |
| ,, కూలీలు 12 పు. | 24.00 |
| వేరుసెనగ పిండి 2 బస్తాలు | 60.00 |
| అమోనియా 1½ బస్తా | 60.00 |
| ఎరువు వేత కూలి 5 దఫాలకు 10 పు. | 20.00 |
| దోస కోతకూలి | 20.00 |
| బెండకాయ కోతకూలి | 75.00 |
| తోట పీకివేత కూలి 8 పు. | 16.00 |
| కవులు | 200.00 |
| మొత్తం రు. | 623.50 |

రా బ డి :

| | | |
|---|---|---|
| రు. | 675.00 | దోసకాయలు 450 మణుగులు మ. 1కి రు. 1.50 చొ॥ |
| రు. | 750.00 | బెండకాయలు 300 మణుగులు మ. 1కి రు. 2.50 చొ॥ |
| రు. | 1425.00 | మొత్తం |
| రు. | 623.50 | ఖర్చు |
| రు. | 801.50 | నికరాదాయము |

## (ఆ.) బీర - పునాసపంట (పసుపు ఏవిలిలో)

వ్యయము :

| | | |
|---|---|---|
| | 2 గ. చాళ్ల తోలకం నాగలికి | 4.00 |
| | విత్తులు 1½ మానిక | 48.00 |
| మే | చాలులో 18 అం.ల కొక గింజ చొ॥ నాటుటకు 5 స్త్రీలు | 5.00 |
| | విత్తుల తడి, పులక తడి - కరెంటుక్రింద | 2.50 |
| | కూలి 1½ పు. | 3.00 |
| జూన్ | కలుపు 2 సార్లు 20 స్త్రీలు | 15.00 |
| | అమోనియా సల్ఫేటు 1 బస్తా | 40.00 |
| | వర్షముకురియువరకు నీరుపెట్టుటకు కరెంటుక్రింద | 2.50 |
| | కూలి 1½ పు. | 3.00 |
| | కీటక నివారణ మందులు 5 సార్లు | 30.00 |
| | ,, కూలీలు 10 పు. | 20.00 |
| | కాయ కోత 30 స్త్రీలు | 30.00 |
| | కాడ పీకివేత 4 పు. | 8 00 |
| | కవులు | 200.00 |
| | మొత్తం రు. | 411.00 |

రాబడి :

రు. 600.00  600 మణుగులు మ. 1కి రు. 1.00 చొ॥
రు. 411.00  ఖర్చు
రు. 189.00  నికరాదాయము

వరిమళ్ళలో పయరబీరకుకూడ దాదాపు ఈఖరు సరిపోవును. కాని దుక్కి చలువతోనే నీరు పెట్టక పండించుదానికి యెరువు ఖర్చులు తగ్గును. తక్కువ ఖ లకు తగినట్లు పంటకూడ తగ్గును. పయరబీరసాగుకు తొలకి బీరకంటె నీరు యెక్కువసార్లు పెట్టవలసియుండును. ఖర్చులు కొలదిగ పెరిగినప్పటికి ఈ పైరు తొలకరిలో మరల చిగిర్చి కొంత కాపిచ్చుటచే తొలకరి బీరకంటె నికరాదాయము తగ్గదు.

(ఇ) పొట్ల

| | | |
|---|---|---|
| | పశువుల యెరువు 10 బండ్లు | రు. 80.00 |
| | వేరుసెనగ పిండి 2 బస్తాలు | 60.00 |
| | దుక్కి 4 చాళ్ల | 40.00 |
| | పశువుల యెరువు మరల పాదులలో వేయుటకు 4 బండ్లు | 32.00 |
| | పాదులుచేయుట, యెరువు కలుపుట 7 పు. | 14.00 |
| | విత్తులు 3000 | 90.00 |
| మే | విత్తులు నాటుటకు 2 స్త్రీలు | 2.00 |
| | | రు. 318.00 |

| | |
|---|---|
| | రు. 318.00 |
| విత్తులు నాటిన దగ్గరనుండి కాపు ఉడుగు వరకు 2 పు. 5 నెలలకు పు. 1కి రోజుకు రు. 2.00 చొప్పున | 600.00 |
| కందిమండలు | 15.00 |
| పందిరి బొంగులు, తారు వగైరా 3 సంవత్స రములకు రు. 450.00, సగటు సం॥నకు | 150.00 |
| పందిరి లేక కూలీలు 16 పు. | 32.00 |
| కీటక నివారణకు 2 సార్లు మందులు | 20.00 |
| మిశ్రమ యెరువులు 6 బస్తాలు | 275.00 |
| అమ్మోనియా సల్ఫేటు 1 బస్తా 100 కి.గ్రా. | 40.00 |
| క్రపులు | 150.00 |
| మొత్తం రు. | 1600.00 |

రాబడి:

రు. 2500 50,000 కాయలు 100 కి రు. 5.00 చొ॥
రు. 1600 ఖర్చు
రు. 900 నికరాదాయము

## (ఈ) దొండ

మొదటి సంవత్సరం ఖర్చులు:

| | | |
|---|---|---|
| నవంబరు | పశువుల యెరువు 50 బండ్లు | 400.00 |
| | దుక్కి 5 చాళ్ళు | 50.00 |
| | 6 అ.×6 అ. చాళ్ళ తోలకం | 5.00 |
| | విత్తనం తీగలు | 50.00 |
| | | రు. 505.00 |

| | | |
|---|---|---|
| | | రు. 505.00 |
| | పాదులు చేత, ముక్కకోత, నీటి పోత వగైరా 5 పు. | 10.00 |
| డిసెంబరు | 1 పాదుకు మూడుముక్కలు నాటుటకు 5 స్త్రీలు | 5.00 |
| | మొలిచేవరకు నీటిపోత కూలీలు 15 పు. | 30 |
| | కుండలు | 30 |
| | మండలు గ్రుచ్చుటకు 8 స్త్రీలు | [illegible] |
| | పందిరికి గుంజలు 1250 కి 275.00<br>బొంగులు 1250 కి 500.00<br>తాడు 10 దిండ్లు 125.00 | |
| | 3 సం.లకు 900.00 సగటుసం.నకు | 300.00 |
| | గుంజలకు బొంగులు కట్టుటకు తీగ 10 పౌ. | 10.00 |
| | పందిరి కోతకూలి 50 పు. | 100.00 |
| జనవరి–1 | కట్టలు చేయుటకు 12 పు. | 24.00 |
| | తీగలు పందిరి యెక్కించుటకు 10 స్త్రీలు | 10.00 |
| | వేరుసెనగ పిండి 5 బస్తాలు | 150,00 |
| | అమోనియాసల్ఫేటు 10 దఫాలకు 2½ బస్తాలు | 100.00 |
| | కలుపు 10 దఫాలకు 80 స్త్రీలు | 60.00 |
| | తెగులు నివారణ మందులు 3 సార్లు | 30.00 |
| | ,, కూలి 6 పు. | 12.00 |
| | నీటి తడుపు కరెంటుక్రింద | 52.00 |
| | కూలీలు 26 పు. | 52.00 |
| జూన్ | పశువుల యెరువు 50 బండ్లు | 400.00 |
| | పందిరిలో యెరువు చల్లి గొప్పు త్రవ్వకం 25 పు. | 50.00 |
| | | రు. 1050.00 |

| | | |
|---|---|---|
| | | రు. 1050.00 |
| నవంబరు | నీటి తడుపు కరెంటు | 8.00 |
| | కూలి | 8.00 |
| డిసెంబరు | తోటకు విశ్రాంతి లేతకాడల కత్తిరింపు 5 పు. | 10.00 |
| | కాయ కోత | 400.00 |
| | కవులు | 600.00 |
| | మొత్తం | రు. 2076.00 |

రాబడి :

రు. 4000.00 కాయ 3200 మళ్లు మ. 1కి రు. 1.25 చొ॥
రు. 2076.00 ఖర్చు
రు. 1924.00 నికరాదాయం

రెండవ సంవత్సరం ఖర్చులు :

| | | |
|---|---|---|
| జనవరి | పశువుల యెరువు 50 బండ్లు | 400.00 |
| | ఎరువు చల్లి మళ్ళలో కలియ త్రవ్వుటకు 25 పు. | 50.00 |
| | పందిరి ఖర్చు కైవంతు | 300.00 |
| | పందిరి మరమ్మతు వగైరా | 50.00 |
| | పిండి బస్తాలు 5 కి | 150.00 |
| | అమోనియం సల్ఫేటు 2½ బస్తాలు | 100.00 |
| | గొప్పు. కలుపు వగైరా 50 స్త్రీలు | 50.00 |
| | కీటక నివారణ మందులు | 50.00 |
| | నీళ్లు 6 నెలలకు 26 సార్లు | 52.00 |
| | ,, కూలి 26 పు. | 52.00 |
| జూన్ | పశువుల యెరువు 50 బండ్లు | 400.00 |
| | పారలతో కలియ త్రవ్వుట 25 పు. | 50.00 |
| | | రు. 1704.00 |

| | |
|---|---|
| | రు. 1704.00 |
| నవంబరు నీటికట్టు 4 సార్లు కరెంటు కూలి | 16.00 |
| కాయ కోత | 400.00 |
| కవులు | 600.00 |
| | రు. 2720 |

రాబడి:

| | | |
|---|---|---|
| రు. 4000.00 | 3200 మణుగుల కాయలు మ. 1కి రు. 1.25 | |
| రు. 1720.00 | ఖర్చు | |
| 1280.00 | నికర లాభం | |

మూడవ సంవత్సరముగూడ పందిరి ఉంచవచ్చును. పై ఖర్చులేగాక పందిరి మరమ్మతుకు అదనముగ రు.100లు ఖర్చు అగును. పంట మూడవ సంవత్సరము తగ్గిపోవును. ఇటీవల యీ సాగు విరివిగా చేయు రైతులు మూడవ సంవత్సరము పెద్ద లాభము లేకపోవుటచే దొండ సాగును చేయుటలేదు.

## అల్లం, దొండ మిశ్రమ సాగు

అదనపు ఖర్చులు:

| | | |
|---|---|---|
| మే | పశువుల యెరువు 25 బండ్లు | రు. 200.00 |
| | ఎరువు చల్లి కలియ త్రవ్వుటకు 25 పు. | 50.00 |
| | విత్తనము 30 మణ్లు | 240.00 |
| | విత్తనము నాటుటకు 15 పు. | 30.00 |
| జూన్ | ఆముదపు పిండి 4 బస్తాలు | 120.00 |
| | అల్లం త్రవ్వుడు కూలి 42 పు. | 84.00 |
| | ,, 42 స్త్రీలు | 42.00 |
| | మొత్తం రు. | 766.00 |

రాబడి :

| | |
|---|---|
| రు. 2500.00 | పంట 500 మణుగులు మ. 1కి రు. 5.00 చొ॥ |
| రు. 766.00 | ఖర్చు |
| రు. 1734.00 | నికరాదాయం అల్లంవరకు |
| రు. 1280.00 | నికరాదాయం దొండవరకు |
| రు. 3014.00 | మొత్తం అల్లం, దొండ మిశ్రమ నికరాదాయం |

అల్లం దొండ మిశ్రమములో దొండ కాపు తగ్గిపోవును. కనుక దొండయొక్క నికరాదాయమును తగ్గించి లెక్క చూచుకొనవలయును.

## (ఉ) చిక్కుడు

చిక్కుడును సాధారణముగ పొట్లతో కలిపి సాగు చేయుదురు. కనుక దీనికి ప్రత్యేకంగా ఎరువు వేయవలసిన పనిలేదు. పందిరి, మండలు కూడ పొట్లకు వేసినవే సరిపోవును.

వ్యయము :

| | | |
|---|---|---|
| జూన్ | విత్తనములు 3 సోలలు | రు. 12.00 |
| | పొట్ల పాదులు పెట్టుటకు కూలీలు 2 స్త్రీలు | 2.00 |
| జులై | తీగలు, మండలు పందిరికి కట్టుటకు కూలీలు 4 పు. | 8.00 |
| ఆగస్టు-సెప్టెంబరు | తీగలు పందిరిపై సర్ది కట్టుటకు 4 దఫాలకు కూలీలు 8 పు | 16.00 |
| | కీటక నివారణ మందులు | 40.00 |
| | .. చల్లుటకు కూలీలు 8 పు. | 16.00 |
| | | రు. 94.00 |

| | | |
|---|---|---|
| | | రు. 94.00 |
| నవంబరు – మార్చి | కాయలకోత కూలి 20 సార్లు 80 స్త్రీలు | 80.00 |
| | పందిరి పీకివేత కూలి 8 పు. | 16.00 |
| | కవులు | 300.00 |
| | మొత్తం రు. | 4[illegible] |

**రాబడి:**

రు. 1200.00 400 మణుగుల కాయకు మ. 1కి రు. 3.00 చొ

రు. 490.00 ఖర్చు

రు. 710.00 నికరాదాయము

షరా:—పొట్లు క్రింద 2 (ఇ) లో వచ్చిన నికరాదాయాన్ని దీనికి చేర్చవలెను.

## (ఊ) చేమ – తొలకరిపంట (పసుపు ఏవిలిలో)

**వ్యయము:**

| | | |
|---|---|---|
| ఏప్రిల్ | దుక్కి 2 చాళ్లు | రు. 20.00 |
| | విత్తనము 3 పుట్లు | 240.00 |
| | $1\frac{1}{4}$ అ. 1 అ. దూరం నాగటిచాలు లేక నాగలి | 10.00 |
| | మోత కూలి 1 పు. | 2.00 |
| | వేత కూలీలు 4 స్త్రీలు | 4.00 |
| మే | పైపాటు దుక్కి 1 చాలు | 10.00 |
| జూన్ | కలుపు 4 దఫాలు 40 స్త్రీలు | 30.00 |
| జులై–ఆగస్టు | అమ్మోనియా సల్ఫేటు 2 బస్తాలు | 80.00 |
| | దుంపలు త్రవ్వుటకు కూలి 50 పు. | 100.00 |
| | కవులు | 200.00 |
| | మొత్తం రు. | 696.00 |

రాబడి:

| | | |
|---|---|---|
| రు. | 900.00 | 600 మణుగుల దుంపలు మ. 1కి రు. 1.50 చొ॥ |
| రు. | 696.00 | ఖర్చు |
| రు. | 204.00 | నికరాదాయము |

## పయరపంట (వరిమళ్ళలో)

| | |
|---|---|
| ఎరువు 10 బండ్లు | రు. 80.00 |
| దుక్కి 4 చాళ్ళు | 40.00 |
| విత్తనము 3 పుట్లు | 240.00 |
| నాటుటకు నాగలి | 10.00 |
| విత్తనము మోత కూలి 1 పు. | 2.00 |
| నాటు 4 స్త్రీలు | 4.00 |
| పైపాటు నాగలి | 10.00 |
| నీరు పెట్టుటకు 20 సార్లు | 40.00 |
| కూలి 20 రో. 1 పు. | 40.00 |
| అమోనియం సల్ఫేటు 2 బస్తాలు | 80.00 |
| కలుపు 8 సార్లు 30 స్త్రీలు | 22.50 |
| దుంపలు త్రవ్వుటకు | 100.00 |
| కవులు | 200.00 |
| మొత్తం | రు. 868.50 |

రాబడి:

| | | |
|---|---|---|
| రు. | 1200.00 | 600 మణుగులు మ. 1కి రు. 2.00 చొ॥ |
| రు. | 868.50 | ఖర్చు |
| రు. | 331.50 | నికరాదాయం |

# (ఋ) చారకంద

వ్యయము :

| | | |
|---|---|---|
| డిసెంబరు – జనవరి | బోదులు గట్టి గోతులు తీయుటకు కూలి 4 అ. దూరమున అ.న కొకటి చొ॥ 60 పు. | 90 |
| | విత్తనపు దుంపలు 100 మణుగులు | 15 |
| | కోసి నాటుటకు కూలి 12 పు. | |
| | నీరు పోత రెండుసార్లు 8 పు. | |
| ఫిబ్రవరి | మొదటిసారి యెరువు వేత కూలి 16 పు. | 24 |
| | 5 బండ్ల యెరువు | 30. |
| | 400 పౌనుల పిండి | 31.00 |
| | పిమ్మట నీరుపోత 10 సార్లు 40 పు. | 60.00 |
| మార్చి | రెండవసారి యెరువు వేతకూలి 16 పు. | 24.00 |
| | 5 బండ్ల యెరువు | 30.00 |
| | 800 పౌనుల పిండి | 62.00 |
| | తరువాత 20 సార్లు నీరుపోత 80 పు. | 1[illegible]0.00 |
| ఏప్రిల్ | మూడవసారి యెరువు వేత 16 పు. | 24.00 |
| | 1200 పౌనుల పిండి | 96.25 |
| | నీరుతోడుట (8 సార్లు) | 135.00 |
| మే | నాల్గవసారి యెరువు వేత 16 పు: | 24.00 |
| | 800 పౌనుల పిండి | 62.50 |
| | మన్ను త్రవ్వి కప్పుట 16 పు. | 24.00 |
| మే–జులై | నీరు తోడుట 24 సార్లు | 180.00 |
| | దుంపలను త్రవ్వుట 40 పు. | 60.00 |
| | కవులు | 200.00 |
| | మొత్తం రు. | 1457.25 |

రాబడి :

| | |
|---|---|
| రు. 1800.00 | 1200 మణుగులు మ. 1కి రు. 1.50 చొ॥ |
| రు. 1457.25 | ఖర్చు |
| రు. 342.75 | నికరాదాయం |

## (బూ) చిరుగడం

వ్యయము :

| | | |
|---|---|---|
| సెప్టెంబరు | దుక్కి 4 చాళ్లు | రు. 40.00 |
| అక్టోబరు | జోడెలు తోలకం 18 అం. | 5.00 |
| | 3 వేల విత్తనపు కాడలు | 50.00 |
| | నీళ్లు పెట్టడము – కరెంటు | 2.00 |
| | కాల్వలుచేసి, నీళ్లు కట్టుటకు కూలీలు 2 పు | 4.00 |
| | నాటు 10 స్త్రీలు | 10.00 |
| | కలుపు 30 స్త్రీలు | 22.50 |
| | అమోనియం సల్ఫేటు 3/4 బస్తా | 30.00 |
| | నీళ్లు 6 తళ్ళకు | 24.00 |
| | దుంపలు దున్నుటకు నాగలి | 20.00 |
| | దుంప నేరుట, బాగుచేత 60 స్త్రీలు | 60.00 |
| | దుంపల పోగువేత వగైరా 4 పు. | 8.00 |
| | కవులు | 150.00 |
| | మొత్తం | రు. 425.50 |

రాబడి :

| | |
|---|---|
| రు. 600.00 | 600 మణుగులు మ. 1కి రు. 1.00 చొ॥ |
| రు. 50.00 | తీగ పశువుల మేతకు |
| రు. 650.00 | |

| | | |
|---|---|---|
| రు. | 650.00 | మొత్తం ఆదాయం |
| రు. | 425.50 | ఖర్చు |
| రు. | 224.50 | నికర లాభం |

## (ఇ) పెండలము (పసుపు యేవిలిలో)

వ్యయము :

| | | |
|---|---|---|
| | పశువుల యెరువు 30 బండ్లు | రు. 240 |
| ఏప్రిల్ | దుక్కి 2 చాళ్లు | 20.00 |
| | విత్తనము 4 పుట్లు - పు. 1కి 60.00 చొ॥ | 240.00 |
| | విత్తనము వేయుటకు నాగలి | 10.00 |
| | ముక్క కోత 3 స్త్రీలు | 3.00 |
| | ముక్క మోత 1 పు. | 2.00 |
| మే | ముక్క నాటుటకు 4 స్త్రీలు | 4.00 |
| జూన్ | కలుపు 30 స్త్రీలు | 22.50 |
| జూలై | వేరుసెనగ పిండి 2 బస్తాలు | 60.00 |
| | అమోనియా సల్ఫేటు ½ బస్తా | 20.00 |
| | దుంపలు త్రవ్వుట 50 పు. | 100.00 |
| | కవులు | 400.00 |
| | | రు. 1121.50 |

రాబడి :

| | | |
|---|---|---|
| రు. | 2000.00 | 1000 మణుగులు మ. 1కి రు. 2.00 చొ॥ |
| రు. | 1121.50 | ఖర్చు |
| రు. | 878.50 | నికరాదాయం |

## (ఞా) సీమవంగ

వ్యయము :

| | | |
|---|---|---|
| | పశువుల యెరువు 4 బండ్లు | రు. 32.00 |
| | దుక్కి 3 చాళ్ల | 30.00 |
| | 1 1/4 గజం చాళ్ల తోలకం(రెండువైపుల) నాగలికి | 10.00 |
| | విత్తులు 1½ గిద్ద | 7.50 |
| | | రు. 79.50 |
| గడ్డు | నారుమడి సెంటుకు పశువుల యెరువు 1/4 బండి | 2.00 |
| | నారు పెంపకం పంగమడికి వలెనే | 15.00 |
| పెట్టుబడి | నీటి పోత 5 పు. | 10.00 |
| | నాటు 4 స్త్రీలు | 4.00 |
| | నాటిన 15 రోజులనుండి ప్రతి 15 రోజులకు 3 దఫాలు పాదులు చేసి యెరువు వేయుటకు 30 స్త్రీలు | 30.00 |
| | ఎరువు వేసిన తరువాత నీటిపోత వరుసగా 3 దఫాలకుగాను 9 సార్లు – 45 పు. | 90.00 |
| | 1 వ దఫా మిశ్రమ యెరువు 220 పౌ. | 33.00 |
| | 2 వ దఫా వేరుసెనగ పిండి 2 బస్తాలు | 60.00 |
| | ,, అమోనియం సల్ఫేటు ½ బస్తా | 20.00 |
| | 3 వ దఫా అమోనియం సల్ఫేటు ½ బస్తా | 20.00 |
| | తెగుళ్ళ నివారణ మందులు 6 దఫాలు | 30.00 |
| | స్ప్రేయర్ కూలీలు 12 పు. | 24.00 |
| | కాయ కోత కూలీలు 60 పు. ½ రో. | 60.00 |
| | కంప పీకి పోగువేత 4 పు. | 8.00 |
| | కవులు | 200.00 |
| | మొత్తం | రు. 685.50 |

రాబడి :

రు 900.00 కాయ 600 మణుగులు మ. 1కి రు. 1.50 చొ॥
రు. 685.50 ఖర్చు
రు. 214.50 నికరలాభం

రేగడి భూములలోగాని, నదీ గర్భపు భూముల గాని యెరువు పెట్టుబడిగాని, నీటి పోత వగైరా కూలి గాని యవసరముండదు. పైపాటుచేసి పదునునిలిపి మ్రాను సాగు చేయుదురు. అందువలన ఖర్చులుతగ్గును. కాని యె గరువు భూములలోకంటె కాపుకూడ తక్కువగనే కాయు. ఏక కాండపు పద్ధతిని నాటి పెంచు తోటలకు రాటలకు, రెమ్మలు విరచి అంటగట్టుటకు అదనపు ఖర్చులగును. దీనికి యెరువులు, నీటి తడుపుకూడ పై సాగులకంటె అధికమే. ఐనప్పటికిని పై సాగులకంటె పంట 2, 3 రెట్లు అదనముగ పండును గనుక నికర లాభ మెక్కువగనే యుండును.

## (ఎ) దోస (పసుపు ఏవిలిలో)

వ్యయము :

| | | |
|---|---|---|
| ఏప్రిల్ | 2 గ. చాళ్ల తోలకం | రు. 2.00 |
| | మినప విత్తులు | 0.50 |
| | దోస విత్తులు 3 గిద్దలు | 6.00 |
| | విత్తుల నాటు కూలి 1 స్త్రీ | 1.00 |
| | వర్షము కురియు వరకు నీరు పెట్టుటకు— కరెంటు క్రింద | 6.00 |
| | కూలి 10 పు. ½ రోజు | 10.00 |
| | | రు. 25.50 |

| | | |
|---|---|---|
| | | రూ. 25.50 |
| మే | కలుపు 2 దఫాలు 10 స్త్రీలు | 7.50 |
| | అమోనియా సల్ఫేటు ½ బస్తా | 20.00 |
| | కీటక నివారణ మందులు | 18.00 |
| | ,, కూలి 6 పు. ½ రో. | 6.00 |
| | కాయ కోత 30 పు. ½ రో. | 30.00 |
| గస | తీగ పీకి పోగు వేయుటకు 4 పు. | 8.00 |
| | కవ్వలు | 200.00 |
| | మొత్తం | రు. 315.00 |

రాబడి :

రు. 625.00 500 మణుగులు మ. 1కి రు. 1.25 ల చొ॥
రు. 315.00 ఖర్చు
రు. 310.00 నికరాదాయం

దోస తీగను రెండవ పైరుకు ముక్కలుగ కోసి భూమి మీద పరచి దున్ని వేసిన పచ్చి యెరువు క్రింద ఉపయోగించును.

## తొలకరి దోస—మే, జూన్ (ఎర్రగరువు భూములలో)

వ్యయము :

| | |
|---|---|
| పశువుల యెరువు 4 బండ్లు | రు. 32.00 |
| ఎరువు చల్లిన కూలి 1 పు. | 2.00 |
| దుక్కి మూడుసార్లు | 30.00 |
| మొత్తం | రు. 64.00 |

| | | |
|---|---|---|
| | మొత్తం రు | 64.00 |
| మే-15 | 6 అ.×6 అ. చాళ్ళ తోలకం నాగలి | 5.00 |
| | పాదులు చేయుటకు కూలి 2 పు. | 4.00 |
| | విత్తులు 3 గిద్దలు | 6.00 |
| | మినప విత్తులు | |
| | విత్తులు నాటిన దగ్గర నుండి వర్షం కురియు వరకు రోజూ నీటి పోతకు 4 పు. ½ రో. 40 రోజులకు | 16 |
| | నాటిన నెలకు వర్షించిన గొర్రుతో పై పాటు కలుపు. పాదులు బాగుచేత వగైరా 2 దఫాలకు 30 స్త్రీలు | 30.00 |
| జూన్ | వేరుసెనగ పిండి 2 బస్తాలు | 60.00 |
| జూలై | అమోనియం సల్ఫేటు ½ బస్తా | 20.00 |
| | ఎరువుల వేతకు 5 పు. | 10.00 |
| | కీటక నివారణ మందులు 3 సార్లు | 20.00 |
| | ,, స్ప్రేయరులు 3 సార్లు 6 పు. ½ రో. | 6.00 |
| | కాయ కోత 30 పు. 1/2 రో. | 30.00 |
| | తీగ పీకి వేయుటకు 4 పు. | 8.00 |
| | కవులు | 150.00 |
| | మొత్తం రు. | 581.50 |

రాబడి:

రు. 750.00 600 మళ్లు మ. 1కి రు. 1.25 ల చొ॥

రు. 581.50 ఖర్చు

రు. 168.00 నికరాదాయం

[63a]

రా బ డి :

రు. 1200.00 కాయ 600 మణుగులు మ. 1కి రు. 2.00 చొ॥
రు. 718.50 ఖర్చు
రు 481.50 నికరాదాయం

## కాకర (వరిమళ్ళలో) పయరక్తారున

వ్యయము :

| | | |
|---|---|---|
| డిసెంబరు | దుక్కి 3 చాళ్లు | రు. 3. |
| | విత్తులు 2 మానికలు | 64.00 |
| | 6×3 అడుగుల పాదుల చేత 6 పు. | 12.00 |
| జనవరి | విత్తులు పెట్టుటకు 4 స్త్రీలు | 4.00 |
| | నీటి పోత 4 పు. | 8.00 |
| | కాపుకు వచ్చువరకు నీటి పోతకు 12 సార్లు 36 పు. | 72.00 |
| | గడ్డలు నలుగగొట్టి మళ్లుచేయుట వగైరాలకు 15 పు. | 30.00 |
| | అమోనియం సల్ఫేటు 2½ బస్తాలు | 100.00 |
| | నీళ్లు పెట్టుటకు 12 సార్లు | 120.00 |
| | కీటక నివారణ మందులు 10 సార్లు | 50.00 |
| | ,, కూలీలు 20 పు. | 40.00 |
| | కాయ కోత 100 స్త్రీలు | 100.00 |
| | కవులు | 200.00 |
| | మొత్తం రు. | 830.00 |

రాబడి :

రు. 1200.00 కాయ 600 మణుగులు మ. 1కి రు. 2.00 ల చొ॥
రు. 830.00 ఖర్చు
రు. 370.00 నికరాదాయం

## (ఐ) గోబి లేక క్యాబేజి

ఖర్చు :

| | |
|---|---|
| విత్తులు 5 ఔన్సులు | రు. 10.00 |
| పశువుల యెరువు 1/5 బండి | 2.00 |
| గొర్రెల యెరువు 1 బస్తా | 3.00 |
| 1½ సెంటు మళ్లచేసి తిరుగగొట్టి విత్తులు చల్లి నీళ్లు చల్లుటకు 3 పు. | 6.00 |
| నారు పీకే నాటు వరకు కలుపు, నీళ్లు చల్లిక, మందులు చల్లుట వగైరా కూలి | 20.00 |
| కీటక నివారణ మందులు | 3.00 |
| ఎరువు 10 బండ్లు | 100.00 |
| దుక్కి 5 చాళ్ళు | 50.00 |
| 1½×1½ అడుగు చాళ్ళ తోలకం నాగలి | 10.00 |
| నారు పీకుడు 2 పు. | 4.00 |
| నీటి పోత 6 పు. ½ రో. | 6.00 |
| నాటు 10 స్త్రీలు ½ రో. | 5.00 |
| నీటి పోత పులక 4 పు 1 రో. | 4.00 |
| నీరు కట్టుట 6 సార్లు | 60.00 |
| మొత్తం | రు. 283.00 |

రు. 283.00

| | |
|---|---|
| కీటక నివారణ మందులు 6 సార్లు | 30.00 |
| ,, కూలీలు 12 పు. | 24.00 |
| వేరుసెనగ పిండి 1 బస్తా | 30.00 |
| అమోనియం సల్ఫేటు 1½ బస్తా | |
| ఎరువు వేత పు. | |
| మనుష్యులతో నాగలి పై పాటు 5 పు. | |
| కలుపు 3 సార్లు 30 స్త్రీలు | |
| కవులు | |
| క్యాబేజి గడ్డలు కోత 15 పు. ½ రో. | 1 |

మొత్తం రు. 690.50

రాబడి:

రు. 1200.00 క్యాబేజి 600 మణుగులు మ. 1కి రు. 2.00 చొ॥

రు. 690.50 ఖర్చు

రు. 509.50 నికరాదాయం

## (ఒ) పూగోబి లేక కాలీఫ్లవర్

వ్యయము:

| | |
|---|---|
| విత్తులు 5 ఔన్సులు | రు. 7.50 |
| నారు పెంపకం క్యాబేజికి వలెనే | 39.00 |
| దుక్కి 5 చాళ్లు | 50.00 |
| 1½×1½ అడుగు దూరం చాళ్ళు తోలకం నాగలి | 10.00 |
| నీటి పోత 6 పు. ½ రో. | 6.00 |

రు. 112.50

| | |
|---|---|
| మొత్తం రు. | 112.50 |
| నాటు 10 స్త్రీలు ః రో. | 10.00 |
| పైపోత నీళ్లు 2 సార్లు 10 పు. ః రో. | 10.00 |
| 3 సార్లు కలుపు 30 స్త్రీలు | 22.50 |
| కీటక నివారణ మందులు 6 సార్లు | 30.00 |
| ,, కూలీలు 12 పు. ః రో. | 12.00 |
| అమోనియం సల్ఫేటు 330 పౌ. | 60.00 |
| వేరుసెనగ మడ్డి 2 బస్తాలు | 60.00 |
| ఎరువు వేత 8 పు. | 16.00 |
| నీటి కట్టుడు 5 సార్లు | 50.00 |
| పూవు కోత 15 పు. ః రో. | 15.00 |
| కవులు | 200.00 |
| రు. | 598.00 |

రాబడి :

రు. 960.00 పూవులు 12000 నూటికి రు. 8.00 ల చొ॥

రు. 598.00 ఖర్చు

రు. 362.00 నికరాదాయం

## (ఓ) తియ్యకంద

| | | |
|---|---|---|
| | పశువుల యెరువు 30 బండ్లు | రు. 300.00 |
| డిసెంబరు | దుక్కి 4 చాళ్లు | 40.00 |
| | విత్తనం 10 పుట్లు | 500.00 |
| | నాగలి బోదెలు తోలకం | 10.00 |
| | ముక్క కోత 6 స్త్రీలు | 6.00 |
| | మొత్తం రు | 856.00 |

| | | |
|---|---|---|
| | | రు. 856.50 |
| జనవరి | చాలులో ముక్క నాటు కూలీలు 6 స్త్రీలు | 6.00 |
| | వి త్తనం కోత కూలి 2 పు. | 4.00 |
| జనవరి-15 | పై పాటు నాగలి | 10.00 |
| జనవరి-30 | ,, ,, | |
| | నీటి తడుపు 20 నార్లు | |
| | కలుపు 3 దఫాలు 60 స్త్రీలు | |
| | అమోనియం సల్ఫేటు 2½ బస్తా | |
| | దుంప త్రవ్వకం 60 పు. | |
| | కవులు | |
| | మొత్తం రు | 1828.50 |

రాబడి :

రు. 2400.00 1200 మణుగులు దుంపలు మ. 1కి రు. 2.00 చొ॥

రు. 1828.50 ఖర్చు

రు. 571.50 నికరలాభం

# 3వ అనుబంధము

కూరదినుసుల నుపయోగించు ముఖ్య విధానములు

1. కాల్చి, ఉడికించి లేక వేచి తయారు చేయునవి.

1. ఇగురుకూర :- కూరగాయలను లేక యితర కూరదినుసులను బాగుగ కడిగి శుభ్రముచేసి పైచెక్కులాచి, అవసరము లేనిమొడల తీయకయే గాని ముక్కలుగోసి తగుమాత్రము ఉప్పును జేర్చి ఒక పాత్రలో వేసి ... తగినంత తేమ లేదని తోచినచో కొంచెము నీరుపోసి ఉడికించి తాలింపు లేక పోపు పెట్టవలెను. 1 కి. గ్రా. (పచ్చితూనిక) తాలింపునకు ఒక గిన్నెలో 20 మి లీటర్లల్లి కొంత చమురుపోసి బాగుగ వేడియెక్కిన పిమ్మట 15 గ్రాముల మినప పప్పు లేక చెక్కు వేసి అది దోరగ వేగిన పిమ్మట 4-8 గ్రాముల మిరపకాయల ముక్కలను వేసి అవియు కొంత వేగిన పిమ్మట 2 గ్రాముల ఆవగింజలను, అవి కొంచెము వేగిన పిమ్మట 1 గ్రాము జీలకర్రను వేసి యందు పైన చెప్పినట్లుడికించిన కూర ముక్కలను వేసి బాగుగ కలిపి మూతపెట్టి యుంచవలెను. ఉడికిన ముక్కలను నీరు హెచ్చుగ నుండుచో కొంచెము వరి పిండిని జేర్చినచో నీరిగిరి కూర పొడిగా నుండును. లేత కాయల ముక్కలను ముందుగా నుడికించకుండగ పైన చెప్పిన దినుసులతో తాలింపు సిద్ధము చేసిన పాత్రలో వేసి మూతపెట్టి గ్రమ్మవిచ్చి దింపవచ్చును. కూరదినుసులందు నీరు హెచ్చుగ నుండుచో తరిగిన ముక్కలను ఉప్పుతో కలిపి నలిపి పిడిచి వేయుటయు లేక ఉడికిన వెనుక వార్చి వేయుటయు గలదు. కాని యిట్లు పచ్చిముక్కలనుండి నీటిని పిడిచివేయుట వలన

గాని ఉడికించిన పిమ్మట మిగిలిన నీటిని వార్చివేయుట వలన గాని కూర యందలి సారము (ముఖ్యముగ ఖనిజములు) కొంతవరకు బోవును. కావున యీ హెచ్చునీటిని పీల్చుటకు తగినట్లు వరిపిండిని పైన చల్లుటయే మంచిది. కాని గిజరు వంకాయలవలె కసరుగాను, కందవలె దురదగాను నః కొన్ని జాతుల కూరలందలి కసరును లేక దురదను చుటకు గాను హెచ్చు నీటితో నుడికించి యీ నీటిని వేసి పిమ్మట తాలింపు పెట్టుట యవసరమగును. యెడల కొన్ని జాతుల కూరల తాలింపునందు యె మిరపకాయ ముక్కలను తగ్గించి పచ్చిమిర్చి లేక అల్లం ముక్కలనుగాని, ఉల్లి లేక వెల్లుల్లిపాయ ముక్కలనుగాని పోపు వేగిన పిమ్మట చేర్చి అవి వేగి లేక యుడికిన పిమ్మట యుడికిన కూర ముక్కలను జేర్చవలెను. గుమ్మడి, కంద మొదలగువాని యిగురు కూరలో బెల్లము చేర్చుటయు గలదు. కొందరు ముక్కలను కాగిన చమురులో వేసి అదివరకు తయారుచేసి యుంచిన కూర పొడుమును పైన చల్లుదురు. ఇందు పైన చెప్పిన తాలింపు ద్రవ్యములేగాక కొంత వేచిన కంది, సెనగ లేక పెసరపప్పు కూడ జేర్చి పొడి చేయబడును. కుక్కరులలో కూరను తయారు చేసి కొనువారి కిది సులభమయిన పని.

**2. పప్పుకూర :-** ఇగురుకూర ముక్కలతో పాటు కొంత పప్పును (సామాన్యముగ పెసర పప్పును) జేర్చి పైవిధముననే ఇగురుకూరగ తయారు చేయవలెను. పప్పు కూరల తాలింపులో కొంచెము ఇంగువను చేర్చినచో

గొందరి కింపుగ నుండును. పప్పుకూరలో గూడ బెల్లమును జేర్చుట కలదు.

3. **పులుసుపెట్టిన కూర** :- కూర నుడికించి పోపులో వేసిన పిమ్మట దానిలో కొంచెము చింతపండు గుజ్జును (కొంచెము నీటిలోవేసి పిసికినది) పోసి కలుపవలెను. ఇట్లు పులుసు పెట్టు కూరలో ఉప్పు కొంచెము హెచ్చుగా వేయ వలసి యుండును. ఉడికించుటకు ముందుగ కొంచెము పులుసు పెట్టుచో ఉడుకుటవలన నందలి విటమిను సి. పోకుండ కొంతవరకు కాపాడునని కనిపెట్టబడెను. చింతపండు పులుసుకు బదులు నిమ్మ, నారింజ, దబ్బ వగైరాల రసమును గూడ పిండవచ్చును. లేక గోగు వగైరా పుల్లటి యాకులను మొదటనే చేర్చి యుడికించవచ్చును. పులుసు కూరల తాలింపులో మెంతులు, కరివేపాకు కూడ చేర్చుట యనుకూలము. పులుసు పెట్టు కూరలలో యించుక పసుపు పొడి చేర్చిన నారోగ్యకరముగ నుండును. బెల్లము చేర్చుటయు గలదు.

4. **గుత్తికాయ కూర** :- వంగ, బీర, దొండ మొదలగు కొన్ని జాతులను ముచికవద్ద కొంత పట్టుండునట్లు నాలుగు లేక ఆరు చీలికలుగ జీరి ఆ చీలికల మధ్య క్రింది విధముగ దయారు చేసిన మసాలా పొడుమును పెట్టి అరటి లేక తాటి తడపతో కట్టి చమురులో వేసి మగ్గనిచ్చిన దినుట కింపుగ నుండును. 1 కి. గ్రా. కూరగాయలకు కావలసిన మసాలా పొడుమునకు 15 గ్రాముల కందిపప్పు, 15 గ్రాముల సెనగపప్పు, 15 గ్రాముల మినపపప్పు, 4-8

గ్రాముల మిరపకాయలు, 15 గ్రాముల ధనియాలు వీనిని పొడిగానే దోరగా వేచి 30 గ్రాముల కొబ్బెరతురుముతోను సుమారు 15 గ్రాముల ఉప్పుతోను జేర్చి పొడుము చేయవలెను. 75-100 మిల్లి లీటరుల చమురులో పైన చెప్పినట్లు మసాలాపొడి కూరి కట్టిన కాయల నిందు వేసి మందాగ్ని సుమారు 3/4 గంట మగ్గనీయవలెను. ఉప్పు యొక్క మసాలా ద్రవ్యముల పరిమితి కూరదినుసు లందలి నీ మితిని బట్టి కూర్చుకొనవలసి యుండును. ఇట్టి కూర గూడ కొందరు పులుసు పెట్టుట గలదు. ఇందుకు కొంత చింతపండు గుజ్జును మసాలా పొడితో కలుపవచ్చును. కరివే పాకు జేర్చిన బాగుగ నుండును.

**5. వేపుడు కూర :-** 1. కి. గ్రా. వంగ, బీర, బెండ మొదలగు కూరగాయలను ముక్కలుగ దరిగి యొక బూరెల మూకుడులో 100-150 మిల్లి లీటర్ల చమురు (నేయి లేక నేయి-నూనె మిశ్రణము) వేసి కాగిన పిమ్మట నందు కూరముక్కలను వేసి మెత్తబడిన పిమ్మట పైన గుత్తికాయ కూరకువలెనే తయారుచేసిన మసాలాపొడి కొంచెము పైన చల్లి కదుపుచు వేయించవలెను. తేమ తక్కువగ నుండుటచే ముక్కలు బాగుగ మగ్గునని తోచినచో మొదట కొంతసేపు మూతపెట్టి యుంచవలెను. చేమ, బంగాళాదుంప మొదలగు దుంపలను ముందుగ నుడుకబెట్టి యిట్లు వేసిన గాని బాగుగ నుడుకకపోవచ్చును. వేపుడుకూర ముక్కలతో ఉల్లిపాయ ముక్కలను గూడ చేర్చవచ్చును. కొని కూర ముక్కలను వేయకముందే వేగిన పోపులో ముందుగ వేసి

కొంత వేగిన లేక ఉడికిన పిమ్మట కూర ముక్కలను వేయవలెను.

6. వేపుడు బిళ్ళలు (వరువెల్) :—అరటికాయ [illegible]ండలము, బంగాళాదుంప మొదలగు దుంపజాతులను [illegible]చని బిళ్ళలుగ దరిగి మిర్చి, ఉప్పు, జీలకఱ్ర వీనిని [illegible]ెము నీటితో మెత్తగ నూరి యా ముక్కల నందు [illegible]పి చమురులో కరకరలాడునట్లు వేయించవలెను. [illegible]డెంచి నిలువ యుంచిన దోస, బుడమ వగైరా వరుగులనుగూడ నిట్లు వేచి తినవచ్చును.

7. బజ్జీలు :—పైన చెప్పిన దుంపజాతుల బిళ్ళలను బీర, వంగ మొదలగు కూరగాయల బిళ్ళలను తగినంత ఉప్పు, కారము, జీలకఱ్ర వీనిని నూరి కలిపిన సెనగ, మినప లేక గోధుమపిండి లేక వీని మిశ్రణములను నీటితో గుత్తముగా కలిపి యా చోవిలో నీ ముక్కలనుంచి చమురులో వేసి వేచవలెను. చోవిలో కారమునకు బదులు బెల్లము లేక చక్కెరను కలుపుటయు గలదు.

8. బోండాలు :—ఉరలగడ్డ మొదలగు దుంపల నుడికించి నలిపి దానితో పచ్చిమిర్చి, అల్లము, ఉల్లి మొదలగు ద్రవ్యములను తగిన ఉప్పును చేర్చి ఉండలుగ చేసి పై విధమున దయారుచేసిన చోవిలో ముంచి చమురున వేచి తయారు చేయుదురు. కొన్ని కూరగాయలను, గోబి, పూగోబి మొదలగు నాకు గూరలను దురిమి బోండాలలోని పూర్ణమందు జేర్చుటయు గలదు.

**11. పులుసు పచ్చడి** - పైన చెప్పినట్లు కాల్చిన వంగ, బీర మొదలగు కూరగాయలను గాని ఉడికించిన ముక్కలనుగాని ముందుగ నుడికించిన చిక్కని చింతపండు గుజ్జులో వేసి ఉప్పును జేర్చి తాలింపు పెట్టవలెను. ఈ తాలింపులో మెంతులనుగూడ చేర్చదగును. సువాసనకొరకు కరివేపాకు, కొత్తిమిరి లేక ఇంగువను లేక ఉల్లిని చేర్చవచ్చును.

**12. కూటు :-** ఇది సన్నముగ దరిగిన కూర ముక్కలను కొంత సెనగ లేక కందిపప్పును చేర్చి కొంచెము చింత పండు పులుసుతో నుడికించి తాలింపువేసి దక్షిణాదిని తయారు చేయు నొక విధమగు పులుసు పచ్చడి వంటిది. ఇందు కొబ్బరికోరును కూడ చేర్చుట గలదు.

**13. పెరుగు పచ్చడి :-** ఉడికించిన ముక్కలను లేక కాల్చిన కాయలను నలిపి లేక పిసికి పెరుగులో వేసి కొంచెము ఉప్పు, పసుపు చేర్చి తాలింపు పెట్టవలెను. ఈ తాలింపులో మెంతులు చేర్చుట యుక్తము.

**14. పులుసు :-** సామాన్యపు పులుసును, పప్పు పులుసును (కొళంబు) తయారు చేయుటలో పలుజాతుల కూరగాయ ముక్కలు చింతపండు పులుసులో వేసి యుడి కింపబడు చుండును. తరచుగ నిందులకు వంగ, బెండ, ఆనగ, గుమ్మడి, చిరుగడదుంప, మునగకాయ, తోటకూర కాడలు, బచ్చలికాడ యివి యనుకూలముగ నుండును, తోటకూర మొదలగు ఆకుకూరలును నిటుపయోగింప బడుచుండును.

పుల్లగనుండు గోంగూర మొదలగు వానితో పులుసు చేయునపుడు చింతపండు అవసర ముండదు.

**15.** మజ్జిగ పులుసు :- ఇందులో వేయుటకు వంగ, సీమ వంగ, బెండ, ఆనప, బంగాళాదుంప మొదలగు లేని కూర దినుసులు మాత్రమే యనుకూలములు.

**16.** చారు:- చారును తయారు చేయుటకు పండుకు బదులు పుల్లగనుండు సీకాయాకు, సీమ కాయలు, నిమ్మకాయల రసముకూడ ఉపయోగింపచుండును.

17. **వడియములు** :- బూడిద గుమ్మడి, నల్లేరు మొదలగు కొన్ని జాతులను ముక్కలుగ గోసి గాని యట్లె గాని నలుగ గొట్టిగాని కొంత రుబ్బిన మినప పిండితో కొంచెము ఉప్పు, కారము చేర్చి వడియములుగ బెట్టి చమురులో వేచి తినదగును.

18. **వరుగులు** :- వంగ, దోస మొదలగు కొన్ని జాతులను పండబారిన లేక ముదిరిన పిమ్మట పలుచని చీరికలుగ జేసి యెండబెట్టి నిల్వయుంచి కావలసినపుడు మరల నానబెట్టి కూరగ చేసిగాని పులుసులోవేసి యుడికించిగాని తినవచ్చును. బెండ, గోరుచిక్కుడు మొదలగువాని నియెండ బెట్టి తయారు చేసిన వరుగును ఉప్పు, కారము రాచి వేచి తినవచ్చును. కూరదినుసుల నిట్లెండ మూలమున శుష్కింపజేయుటకు బదులు ఉష్ణవాయు సహాయమున శీఘ్రముగను అందలి సారము అంతగా చెడకుండగను తయారుచేయ

కలుగు శోషకయంత్రములు (Dehydrators) కూడ కనిపెట్టబడి ద్వితీయ ప్రపంచ సంగ్రామమున విరివిగ నుపయోగమునకు వచ్చెను.

పెద్దఉసిరిక, రాచఉసిరిక, ఎర్రగోగు పుష్పకోశ[illegible]ు, పచ్చిమామిడికాయలు, నారింజకాయలు, నిమ్మ[illegible]లు, మాకీఫలము మొదలగు వాని ముక్కల నుడికించి [illegible]రను లేక బెల్లమును, కొన్ని పరిమళ ద్రవ్యములను [illegible] మురబ్బాలు (వీనిని తీపి యూరుగాయ లనవచ్చును)గ [illegible]యారు చేయవచ్చును. ఈ విషయమయి పండ్లు 2, 3 భాగములందు విపులముగ వ్రాయబడెను.

## III ఉడికించ కుండగ తయారు చేయునవి

1. **పచ్చడి బద్దలు:**—మామిడికాయ, నక్కదోసకాయ మొదలగు వానిని చీలికలుగ లేక పలుచని బిళ్ళలుగ తరిగి ఉప్పువేసి యించుక కారమును, జీలకర్రను నూరి కలిపి ఊరవేసి తినుట గలదు. స్వతస్సిద్ధముగ పులుపులేని బీర, ములుదోస, అల్లము, మామిడల్లము, ముల్లంగి, గాజర మొదలగువాని ముక్కల నూరవేయుటకు నిమ్మకాయరసము చేర్చవలసి యుండును.

2 **పచ్చడి:**—బీర, దోస మొదలగు జాతుల పచ్చి ముక్కలను రుబ్బి అందు ఉప్పు, పచ్చిమిర్చి, అల్లము లేక ఉల్లి, అవసరమగుచో నిమ్మకాయ రసము చేర్చిన తినుట కింపుగ నుండును. ఇట్లు నూరిన ముద్దలో తాలింపు పెట్టి వను పెట్టవచ్చును. 25 గ్రాముల తోటకూర ఆకులు,

12 గ్రాముల తులసిఆకు, 70 గ్రాముల బీరకాయ లేక పొట్ల కాయ ముక్కలు కలిపి నూరిన పచ్చడి చాల యారోగ్య వంతముగ నుండునని లేకరి యనుభవము. దీనితో కొంత వెలగకాయ లేక పండు గుజ్జునుగాని పచ్చి లేక గో మామిడికాయనుగాని కలిపి రుబ్బిన రుచివంతముగను ఉప్పువేయుట మాని తేనె లేక బెల్లము లేక యర లేక సపోటా పండ్లో జేర్చినను ఆకర్షవంతముగ నుం

**3. పెరుగు పచ్చడి:**—సీమవంగ, కాబేజీ, వ మొదలగు ఒక విధమగు వాసన వేయు జాతుల వ లను పెరుగులో వేసి ఉప్పు, కారము జేర్చి యట్లైగాని తాలింపు పెట్టిగాని తినుటకు వీలగును. ఆరోగ్యవంతముగను నుండును.

**4. ఊరుగాయలు:**—దోస మొదలగు కొన్నిజాతుల కాయల పచ్చిముక్కలను ఉప్పు, కారము, నూనె వగైరా లను జేర్చికొంతకాలమువరకు నిల్వయుండునట్లుచేయవచ్చును. మామిడి, నిమ్మ, దబ్బ, నారింజ మొదలగు జాతుల కాయల నూరుగాయగ తయారు చేయు విధానములు పంక్తు - 2, 3 భాగములందు దెలుపబడెను.

కూడ వేయుదురు. ఈ పనితోపాటు వంగ పైరులోకూడా కలుపు తీత, తెగుళ్ళ నివారణకుమందులను (Spray) చల్లుట మొదలగు పనులను చేయుచునే యుండవలయును. వంగ పైరు నాటిన 2 నెలలకు కాపుకాయుట ప్రారంభించిన 2½ నెలలకు కాపు కాయుట తగ్గిపోవును. వంగ పూర్తియగు లోపల చిక్కుడు తీగలను పందిరిమీా వైపులకు సరిసమానముగా సర్దుకొనుచు ఒకదానికి చుట్టుకొనివున్న తీగలను విడదీసి విడివిడిగా తడ కట్టెదరు. అందువలన తీగలు పందిరిమీాద అన్ని సమానముగా అల్లుకొనును. మరియు తీగలు ఒకి కొకటి చుట్టుకొనకుండ విడదీయుటవలన తెగులు బీజములు తీగచుట్టలలో దాగుకొని అభివృద్ధి చెందుటకు ఆస్కార ముండదు. అందువలన చిక్కుడు తీగలు ఆరోగ్యముగా కూడా పెరుగునని గుంటూరుజిల్లా నారాకోడూరు గ్రామ రైతుల యనుభవము. చిక్కుడు పందిరి 6 అడుగుల యెత్తు వరకు ఉంచెదరు. అందువలన నీ పందిరి క్రింద తిరుగుచు తీగలు సర్దుటకు, చిక్కుడు కాండములమీాదగల పిలకలను ఆకులను తీయుటకు, కీటకనివారణ మందులు చల్లుటకు, కాయకోతకు వీలుగ నుండును. పందిరికి వేయు నిలువు రాటలు సామాన్యముగా బందిరికంటె సుమారు 6 అడు గులవరకు యెత్తుండును. చిక్కుడు తీగలు పందిరియంతయు అల్లుకొనిన తరువాత రాటలకు పైవరకు అల్లుకొని పైనకూడ కాపు కాయును. తీగలు పందిరిపై ప్రాకుట యారంభించిన దగ్గరనుండి ప్రతి 15 రోజులకు ఒకసారి చొప్పున 4 లేక 5

రకములైన మందులు చల్లినను పూర్తిగా నివారింపబడుట లేదు. అందువలన ఒకటి రెండు కోతలకు కొంత వరకు పంట నష్టపడక తప్పదు. కాని తెగులు నివారణ మందుల నుపయోగింపనిచో మరింత యెక్కువ నష్టము కలుగును.

**నారు పెంచు విధానము** :- ఎకరము వంగ సాగు టకు 2 సెంట్ల భూమిని బాగుగ తిరుగత్రవ్వి, గడ్డలు ండ నలుగగొట్టి, 10పల్లికలు మెత్తటి పశువుల యెరువు తలోల ఆముదపుపిండి మడిమీాద చల్లి పారతో కలియ వ్వి 1.2 మీాటరు వెడల్పు మళ్లుచేసి పైన 3 లేక 4 గిద్దలు విత్తులను మడియంతయు సమానముగా పడునట్లుచల్లి విత్తులు మడిలో కలిసిపోవు వరకు దంతితో కలియత్రిప్పి చిల్లు డబ్బాతో మొలచేవరకు రెండు పూటలు నీళ్ళు చల్లవల యును. మడిమీాద ఈత ఆకులను కప్పుట మంచిది. ఈ పద్ధతిలో వారమునకు మొలక పూర్తియగును. మొలచిన తరువాత రోజువిడిచి రోజు సాయంత్రము ఒక పూట మాత్రమే మూడు దఫాలు నీళ్ళు చల్లవలయును. తరువాత 5 రోజులవరకు మడిని యెారనిచ్చి మొక్క పెరకువనుబట్టి 1.5 కిలోల అమోనియా సల్ఫేటును మడిమీాద చల్లి నీళ్ళు పెట్టవలయును. తరువాత వాతావరణమునుబట్టి వారము రోజుల కొకసారి నారు పీకి నాటువరకు నీళ్ళు పెట్టుచుండ వలయును. మొలచిన తరువాత నారు పీకువరకు కలుపు తీయుచు తెగుళ్ళనివారణ మందులు అవసరమునుబట్టి చల్లు చుండవలయును. నారుమడిని నీరు పారించికూడ పెంచ వచ్చును. అయితే చల్లి పెంచిన నారుమడి క్షేమముగ పెరు

గును. వర్ష ఋతువులో నారు పెంచదలచినవారు "మడి పద్ధతి" (Bedsystem) అనగా 1.2 మీటరు వెడల్పు మళ్ళకు ఇరు ప్రక్కల 30 సెం. మీ. వెడల్పు 15. సెం. మీ. లోతు గాడితీసి, యామట్టిని మడిమీదసర్ది యెత్తయిన మడిమీద విత్తుట. యెరువు చల్లి చిల్లులడబ్బాతో నీరు చల్లి పెం నారుమడిలోని నారు అనుకూలముగ పెరుగును. ఈ వలన నారుమడిలోని మొక్క చాల అరుదుగ చచ్చున చావుకు కారణము ఒక రకమైన శిలీంధ్రములు. ఈ త్రె యెత్తయిన మళ్ళలో అరుదుగా కనబడుచున్నది. వీటి రణకు మొక్క మొలచిన తరువాత వారం రోజుల సారి, మరల వారం రోజులకు రెండవసారి బోర్డోమిశ్రమ మును మడిమీద స్ప్రేయరుతో బాగుగ చల్లవలయును. కీటక నివారణకు మాత్రము డి.డి.టి. 50% గాని, యెండ్రిన్ గాని చల్లవలయును. నారును యెంత దృఢముగా పెంచిన తోట అంత తొందరగా వృద్ధినొంది వెంటనే యెక్కువ ఫలసాయమును చేతి కందించును. బలమైన నారు యెరువు కొరతనుకూడ కొంతవరకు సర్దుకొనగలదు.

## బీ ర

బీర సాగును నీటి వసతిగలచోట్ల తొలకరి సాగుకు 2 గజముల దూరముగల చాళ్ళలో ½ గజమునకు ఒక్కొక్క గింజ చాలులో నాటి నీళ్ళుపెట్టెదరు. సామాన్యముగ పునాససాగును పసుపుయేవిలిలోగాని, లోగడ యేవిలి దున్నిన భూమిలోగాని పండించెదరు. అందువలన నీ పంటకు పసువుల యెరువును ప్రత్యేక ముపయోగించరు. కాని మొక్క

ణమునుగాని, దానికి సంబంధించిన కంపెనీ మందులనుగాని ఉపయోగించి నివారింప వచ్చును.

ఎఱ్ఱగరువులో చేయు పునాస సాగుకుకూడ ౧
ముల చదరముగల దూరములో పాదులనుచేసి,
నాటి, వర్షము కురియువరకు ప్రతి 4 లేక 5
పాదులకు నీరుపోసి మాత్రము పెంచుచున్నారు.
అప్పుడప్పుడు పాదుల బాగుచేత, పాదులలో యెం
నీటిపోతలకు అదనపు ఖర్చులగుచుండును. అం
నికరాదాయము కొంతవరకు పై సాగుకంటె తగ్గున
సాగుకుకూడ యెరువులు, కీటకనివారణ మందులు
నరమే.

వరిమళ్ళలోని సాగుకు పై రెండు సాగులకంటె దుక్కి-ఖర్చులు, గడ్డలు పగలుగొట్టుట కగు ఖర్చులు అదనముగ పెట్టవలసి యుండును గడ్డలు లేకుండ పగులగొట్టుటవలన యీపైరుకు మిడుతలు వగైరా కీటకముల బారినుండి కొంత వరకు కాపాడవచ్చునని కొందరి రైతుల యనుభవము. దోస పైరుకూడ బీరకు వలెనే రెండు నెలలకు కాపు ప్రారంభించును. కాని కాపు మాత్రము 1½ నెలలలోనే ఒకటి రెండు కాపులు మాత్రము కాచి ఉడిగిపోవును. కాని యీపైరుకు మరల చిగిర్చి కాపు కాయు గుణములేదు.

## పొట్ల

పొట్ల, కాకర, బీర, సొర, దొండ మొదలగు పాదులను పెరటిలో పెంచదలచిన 3 అడుగుల చదరము 2 అడు

చెప్పుచున్నారు. మరియు వర్షములు లేనిచో సారదములు వేసిన వెంటనే నీళ్లు పెట్టుటవసరము.

పొట్లసాగుకు విత్తు నాటినదగ్గరనుండి కాపుడిగి పోవు ...ను నీటిపోత, కలుపుతీత, మండలుగ్రుచ్చుట, తీగలను ...పై సర్దుట, యెరువు వేత, కాయలచివర రాళ్లు కట్టుట ...వారణమందులు చల్లుట, కాయ కోత వగైరాలకు ...పురుషు లవసరము.

## దొండ

గుంటూరు, కృష్ణా జిల్లాలలో విరివిగా దొండ సాగు చేయవారు శక్తినిబట్టి 25 నుండి 100 బండ్లవరకు పశువుల యెరువును భూమిమీద చల్లి 5 నుండి 10 చాళ్ళవరకు దుక్కి దున్నుదురు. పాదులుచేసి దొండతీగలను భూమినుండి పందిరి యెత్తువరకుగల 1 మీటరు పొడవు దృఢమైన కాండములను మాత్రమే ఒక్కొక్క దానికి మూడు కణుపులు వుండునట్లు ముక్కలు చేయుదురు. తరువాత పైచెప్పిన ప్రకారములో చేసిన పాదులనుతడిపి, ఒక్కొక్క పాదులో మూడు ముక్కలను రెండు కణుపులు భూమిలో నుండునట్లును, ఒక కణుపు చిగుర్చుటకు భూమిపై కుండునట్లును యేటవాలుగా పాతి పెట్టుదురు. నీడకొరకు తీగముక్కలపై వరిగడ్డిని కప్పి యుంతురు. తరువాత రెండవరోజున ఒకసారి నీళ్లుపోయు దురు. మరల రోజు విడచి రోజు రెండుసార్లు 4 రోజులకు ఒకసారి చొప్పున రెండు పోతలు పోయుదురు. 15 దినములకు మొలక ప్రారంభించి 20 రోజులలో మొలచిపోవును. మొలచిన

దొండపందిరి కాపుకు వచ్చిన తరువాత 25 బస్తాల గొర్రెల యెరువునుగాని, 5 బస్తాల ఆముదపు పిండినిగాని బలమైన మోతాదును ఒక దఫావేసి తరువాత ప్రతి 15 రోజులకు ఒకసారి 25 కిలోల అమోనియా సల్ఫేటును [illegible]చు, నీరు పెట్టుచుండిన కాపు వృద్ధియగును. దొండ [illegible] పశువుల యెరువు అధికముగా నిచ్చిన పంటకూడ [illegible]ప్ర మోతాదుననుసరించి పండుచున్నది. కావున [illegible]గుకు పశువుల యెరువు మిగుల శ్రేష్ఠము. తవులపాకు [illegible]లతో పరివర్తనముచేసి వేసిన దొండ కాపు విపరీత [illegible] కాయును. దొండ సాగులో ప్రతి 1౦ దినములకు కలుపుతీసి శుభ్రపరచుచుండవలయును.

ఇటీవల దొండ అల్లపు మిశ్రమ సేద్యముచేయు రైతులు దొండ నాటిన రెండవ సంవత్సరము మే నెలలో అల్లమునాటి పండించి అల్లపు పంట పూర్తియైన తరువాత అల్లముతోపాటు దొండ పందిరినికూడ తీసివేయుచున్నారు. మరి కొందరు దొండనాటిన మొదటి సంవత్సరము మే లోనే అల్లమునాటి అల్లపు పంట పూర్తియైన తరువాత ఆ సంవత్సరమే దొండను కూడ తీసివేయుచున్నారు. కాని లోగడ దొండ సాగుచేయువారు దొండ పందిరిని మూడు సంవత్సరముల వరకుంచెడివారు. కాని పంటల పరివర్తనములవలన దొండకాపు ఎక్కువ వచ్చుటచే ఒకటి రెండు సంవత్సరములకే మార్చివేయుచున్నారు. అల్లపు మిశ్రమ సేద్యము దొండ కాపును కొంత వరకు నష్టపెట్టినను అల్లమువలన వచ్చెడి రాబడి అంతకంటె లాభకరముగ నున్నది.

అల్లపు మిశ్రమ సేద్యమునకు దొండకువేయు యెరువులు మాత్రమేగాక అదనముగ 25 బండ్లు పశువుల యెరువు, 4 బస్తాలు ఆముదపుపిండి వేయవలయును. అల్లపు సాగునకు రసాయనపు ఎరువులను వాడకుండుట క్షే కొందరు రైతుల యనుభవము. అందువలన యీ కుళ్ళు తెగులు రావచ్చును.

## అల్లము, దొండ మిశ్రమము

అల్లము, దొండ మిశ్రమ సాగుకు అల్లము చిన సంవత్సరము జనవరి, జూన్ నెలలలో పశువుల దొండ సాగుకు యిచ్చినప్పటికిని మరి 25 బండ్లు అ సాగుకు అదనముగ మే నెలలో భూమిమీద చల్లి పారలతో కలియద్రవ్వవలయును. తరువాత అల్లపు విత్తనమును, 5 సెం. మీ॥ల పైజుగల ముక్కలను, 20-25 సెం. మీ.లకు 5 సెం. మీ.ల లోతుండునట్లు భూమిలో నాటవలయును. అల్లము నాటిన తరువాత వర్షము కురియువరకు నెలకు 5 తడులు నీళ్ళు పెట్టుచుండవలయును. ఈ పైరు నెలకు మొలక ప్రారంభించి 40రోజులకు పూర్తిగా మొలచిపోవును. అల్లము నాటిన నెలకు 4బస్తాలు ఆముదపుపిండి మళ్ళలోవేసి నీరు పెట్టవలయును. కలుపు వగైరా దొండ పందిరికి చేయు పాటులోనే కలసివచ్చును. అల్లము పండించిన సంవత్సరము చివరకు దొండనుకూడ తీసివైచి మరియొక పైరును సాగు చేయుచున్నారు. ఇటీవల కొందరు రైతులు మొదటి సంవత్సరమే దొండ పందిరిలో అల్లమును నాటి పండించి

అల్లముతోపాటు దొండ పందిరి కూడ తీసివేయుచున్నారు. అల్లపు పంటను నాటిన దగ్గర నుండి 7 లేక 8 నెలలకు పిమ్మట త్రవ్వి తీసికొనవచ్చును కాని 12 నెలలకు మించి భూమిలో [illegible]న పూర్తిగ చెడిపోవును. అల్లము త్రవ్విన తరువాత [illegible] నిల్వయుంచి విత్తనమున కుపయోగించవచ్చును. [illegible] వరకు నీ సాగుకు తెగుళ్ళు ఎక్కువగా వచ్చుట

## కాకర

కాకర సాగును ముందొలకరిలోను, నవంబరునుండి ఫిబ్రవరి నెలల వరకేగాక ఆగస్టు, సెప్టెంబరు నెలలందుకూడ విత్తులను నాటి కాకరకాయలను పండించుచున్నారు. ఇటీవల నీ సాగును పందెళ్ళువేసి, కంపమండలు పాతి సాగుచేయుట మాని, బీర, దోస పైరులవలెనే నేలమీాద ప్రాకించి పండించుచున్నారు. ఇందువలన పందిరికి కావలసిన పెట్టు బడితో నిమిత్తములేకుండ పని జరుగుచున్నది.

ఏప్రిల్, మే నెలలు, జనవరి ఫిబ్రవరి నెలలందు సాగు చేయు పైరును నీటి తడుపుతోను, ఆగస్టు-సెప్టెంబరు, నవం బరు నెలలందు చేయు పైరును దుక్కి-చలువతోను పెంచు చున్నారు. అందువలన నీ సాగుకు పశువుల యెరువు, గొర్రెల పెంట, పిండియెరువులను దుక్కిలోనే వేసి పండించు చున్నారు. తొలకరిలోగాని, పయరకారునగాని నాటు సాగుకు నాటిన నెలనుండి ప్రతి 15 రోజులకు కొంత సార దముల నిచ్చి నీరుపెట్టి పండించుచున్నారు.

ఏప్రిల్ - మే, జనవరి - ఫిబ్రవరి నాట్లు చాళ్ళలో పాదులు చేసిగాని, నేరుగా చాళ్లలోగాని నాటెదరు. కాని ఆగస్టు-సెప్టెంబరు నెలలందు నాటు పైరు 6×6 అడుగుల దూరమున ఎత్తుదిబ్బలమీద పాదులుచేసి విత్తులు దరు. ఆగస్టునెలలో ప్రారంభించు సాగుకు వ: ప్రవేశించిన తరువాత నాటుట శ్రేష్ఠమనియు, = నెలలో ప్రారంభించు సాగుకు ఆగస్టునెల సాగుభ మరియొక చాలు అదనముగా దుక్కి దున్నట మనియు గుంటూరుజిల్లా నారాకోడూరులో కూరగా విరివిగ పండించు రైతులు చెప్పుచున్నారు. ఈ సాగులందును విత్తులు నాటిన 25 రోజులకు పాదులమ నాగళితో పైపాటు చేయుదురు. నవంబరు నాటుకు 6×6 అడుగుల దూరములో చాళ్ళతోలి రెండుచాళ్ళు కలియుచోట పాదులుచేసి, దొండపాదులకువలెనే ముందుగా పాదులను నీటితోతడిపి, రెండవరోజున విత్తులునాటి, మరల నీళ్ళు పైపోత పోయవలయును. ఆగస్టు - సెప్టెంబరు నాటులో మాత్రము విత్తులుపెట్టి పోయుదురు. మరల 6 వ రోజున పులకపోత పోయుదురు. నవంబరు నాటుకు నాటిన 20 రోజులకు పశువుల యెరువు 5 బండ్లు లేక మిశ్రమ సారదములను 200 కిలోలుగాని, 100 కిలోలు అమోనియా సల్ఫేటుతో కలిపి పాదులకు వేసి నీటిపోత పోయుదురు. మరల మూడవనాడు రెండవసారి నీటిపోత పోయుదురు. పాదులు ఆరిన తరువాత నాగలితో పైపాటు చేసి తీగలను బాగుచేసెదరు. సామాన్యముగ నవంబరులోనాటు సాగు

ఈ పైరుకు అక్షింతలపురుగు, లద్దెపురుగులేగాక కాయపుచ్చు, లంబాడి తెగులు, తాటియాకు తెగులు (ఆకులు అంచులు మాడుట ప్రారంభించి చిగుళ్లు పూ రిగ మొండిపోవుట) సంభవించుచున్నవి. మాలాథయా పురుగులు పోవును.

కాకరవిత్తులను పునాస పండించిన విత్తులు సాగునకును పయరను పండించిన విత్తులు పునాసకును ఉపయోగించకూడదు. దీనివలన విత్తులు రొట్ట పెరుగునేగాని కాపు బాగుగ కాయదు. పునాసపంట విత్తులు సాగుకు, పయరపంట విత్తులు సాగుకు మాత్రమే ఉపయోగించవలెను.

## పెరుగుతోటకూర

సెంటుకు 1/4 బండి యెరువు చల్లి, దీనిని మట్టిలో కలియునట్లు తిరగత్రవ్వి 2 గజముల వెడల్పు 12 గజముల పొడవుగల మళ్లను తయారుచేసి 1½ సెంటుకు గిద్ద విత్తులను చల్లుదురు. విత్తులను 36 గంటలు నీటిలో నానవేసి తరువాత ఆ విత్తులను గుడ్డతో మూటగట్టి రెండురోజులవరకు చల్లని ప్రదేశమునందు నిల్వయుంచి తదుపరి విత్తులతో చల్లని యిసుక 4 రెట్లు కలిపి మడియంతయు సమానముగ పడునట్లు చల్లి విత్తులు భూమిలో కలియునట్లు దంతెతో గాని, చేతితో గాని బాగుగ కలియత్రిప్పి నీళ్లు పెట్టుదురు. దీనిని కొందరు కడవలతో గాని చిల్లుల డబ్బాతో గాని నీరు చల్లి పెంచెదరు. కాని అప్పుడు మడి వెడల్పు 4 అడు

గులు మాత్రమే ఉంచవలయును. లేనిచో నీళ్లు చల్లుటకు ఇబ్బందిగా నుండును. మరల నాల్గవరోజున నీరు పారించిన మడికి పులకతడి వేయుదురు. విత్తులు నానబెట్టి చల్లినందున [illegible]లు త్వరగాను, ఒకేదఫా మడిలో పూర్తిగాను మొల[illegible] తరువాత అవసరమునుబట్టి 10 రోజుల కొకసారి [illegible]ట్టవలయును. మొక్కలు తొందరగా పెరిగి కోతకు [illegible]కుగాను విత్తులు చల్లిన 15 రోజులకు సెంటుకు [illegible]ల అమోనియం సల్ఫేటు చల్లి నీరు పెట్టుదురు. [illegible] పెరిగిన మడిలోని మొక్కలను 25 రోజులకే పీకుట [illegible]ంభించి 45 రోజులలో పూర్తిగా మడియంతయు పీకి వేయుదురు. ఆ పైన నిల్వయుంచిన మొక్కలు ముదిరి పీచుకట్టి తినుటకు అనుకూలముగా నుండవు.

ఈ పైరును అన్ని ఋతువులలోను విత్తులు చల్లి పెంచవచ్చును. దీనికి లద్దెపురుగు ఆశించి మొక్కల ఆకులను తినివేయును. దీనిని బి.హెచ్.సి. 5% తో నివారింపవచ్చును. ఈ పైరు అతి వర్షములు కురిసిన కుళ్ళిపోవుట కూడ సంభవించును.

## సోయకూర

(Peucedanum sowa N. O. Umbelliferae)

దీనిని సెంటుకు 3 గిద్దలు విత్తులు చల్లి నీళ్ళుపెట్టి మడిమీాద ఈత ఆకులను కప్పవలయును. ఈ పైరు వారము రోజులకు పూర్తిగా మొలచును. మొలచిన తరువాత మడిమీాద కప్పు తీసివేయవలయును. తరువాత వెంటనే మడికి

నీళ్ళు పెట్టవలయును. ఈ పైరుకు 15 రోజుల కొకసారి చొప్పున రెండుదఫాలు అమోనియం సల్ఫేటు 1½ కిలోల చొప్పున మడిమీద చల్లి నీళ్ళు పెట్టవలయును. వి‍‍ చల్లిన 1¼ నెలకు కోత ప్రారంభింపవచ్చును. 15 కొక కోత చొప్పున 4½ నెలల వరకు ఉపయో ఈ పైరును తల్లతుంచకుండ ప్రక్క పిలకలను కోసికొనుచుండవలయును. ఈ కూరను వర్షాక శీతాకాలమందు పెంచుట సులభము. వేసవి కాల పెంచుట కనుకూలముగా నుండదు. ఈ కూరను ద్రవ్యముగా తక్కిన కూరలలో కలిపి ఉపయోగి ఇది సువాసనగల ఆకులతో సోపు మొక్కను పోలి యుండును.

## పప్పు కూర

ఈ పైరు సాగు చేయుటకు సెంటుకు ¼ గిద్ద విత్తులు చల్లవలయును. ఈ విత్తులు చల్లుమడిని గడ్డ లేకుండా నలగ గొట్టి చదరముచేసి విత్తులు చల్లి నీళ్ళు పెట్టవలయును. ఇది నాలుగు రోజులకు పూర్తిగ మొలచును. ఈ పైరుకు విత్తిన 15 రోజుల తరువాత ప్రతి 15 రోజులకు సెంటుకు ¼ కిలో అమోనియా సల్ఫేటువేసి నీళ్లు పెట్టుచుండవలెను. ఈపైరుకు నీళ్ళు ప్రతి 5 రోజులకు ఒకసారి పెట్టుటవసరము. దీనిని మార్చి నుండి జూన్ వరకు సాగుచేయుటకు అనుకూలముగ నుండును. ఈ ఆకును ప్రతి 15 రోజులకు ఒకసారి మాత్రము కోయుచుండ వచ్చును.

## పాలకూర

ఈ సాగును చదరముగానున్న మడిలో సెంటుకు ½ సోల విత్తులుచల్లి పారతో అంగుళము లోతువరకు కలియ [illegible] మడి చదరము చేసి నీళ్లు పెట్టవలయును. మరల పులక [illegible] రోజున పెట్టవలయును. విత్తులు చల్లిన 15 రోజుల [illegible]ప్రతి 15 రోజులకు సెంటుకు 1.5 కిలో అమోనియా [illegible] చల్లి నీళ్లు పెట్టవలయును. నెలరోజులు దాటిన [illegible]త 15 రోజుల కొక కోత కోయుచు 3 నెలల వరకు [illegible]నే ఉపయోగింపవచ్చును. ఈ పైరుకు ఆకుమీాద [illegible]టె చుక్క తెగులు సోకును. దీనిని బి. హెచ్. సి. 10% గల పొడి మందును చల్లి నివారింప వచ్చును.

## కొయ్యతోటకూర

ఈ పైరుకు సెంటుకు ½ గిద్ద విత్తులను చల్లి నీళ్ళు పెట్టవలయును. నాలుగు రోజులకు మొలక పూర్తియగును. ఏ కారణము చేనైనను నాల్గవ రోజున మొలక రానిచో వెంటనే పులకతడి పెట్టవలయును. దీనిని సంవత్సరము పొడవునను చల్లి పెంచవచ్చును. చల్లిన నెలనుండి కూర కోతకు వచ్చును. ఈ పైరుకు గూడ చల్లిన 15 రోజుల నుండి సెంటుకు 1.5 కిలో అమోనియా సల్ఫేటును ప్రతి 15 రోజులకు వేయుచు వాతావరణమును బట్టి 5 నుండి 10 రోజుల లోపల నీళ్ళు పెట్టవలయును. దీనిని 15 రోజుల కొక సారి కోయుచుండవలయును. ఈ పైరును లద్దెపురుగు

మాత్రము నష్టపెట్టును. బి. హెచ్. సి. 10% పొడిమందు నుపయోగించి దీనిని నివారింపవచ్చును.

## గోబి లేక కోసుగడ్డ (క్యాబేజి)

ఇటీవల నీ సాగును విరివిగాచేయు రైతులు క్యాబేజి పైరు నాటుటకు 1¼ సెంటు భూమిలో యెరువుచేసి దున్ని 1 1/4 మీ. వెడల్పు 9 మీాట గల మళ్ళుచేసి 1 బస్తా గొర్రెల యెరువును మెత్త గొట్టి మడిమీాద చల్లి పారతో 5 సెం. మీా.ల లో కలియత్రవ్వి గడ్డలులేకుండ నలుగగొట్టి మడి చదర 30గ్రా. క్యాబేజీ విత్తులకు 1¼ గిద్ద యిసుకకలిపి మడి సమముగా విత్తులు పడుటకు విత్తులను నాలుగు భాగములు చేసి నాలుగుసార్లు తిరిగి చల్లి విత్తులు మట్టిలో కలియునట్లు చేతితో కలియత్రిప్పి చదరముచేసి చిల్లుల డబ్బాతో నీళ్ళు పట్టవలయును. నారు మొలకెత్తి మొలచు వరకు రోజుకు మూడు నాలుగుసార్లు డబ్బాతో నీళ్ళుపట్టుచు, మడిమీాద నీళ్ళు నిల్వకుండగను మడిఆరి చెక్కు కట్టకుండగను చూచు కొనవలయును. ఐదు రోజులకు గింజలు మొలకెత్తును. అప్పటి నుండి సాయంత్రము ఒకసారి మాత్రమే 3 రోజుల వరకు నీళ్ళు చల్లు చుండవలయును. తరువాత మడిని రెండు దినము లారనిచ్చి పారుదల నీరు పెట్టవలయును. విత్తులు చల్లిన 10 రోజులకు మూడవ ఆకు వేయును. అప్పుడు డి. డి. టి. 50% మందును మడిమీాద నీళ్ళతో కలిపి స్ప్రే చేయవలయును. నారు పీకులోపల కీటక నివారణ

సంవాలు మూడు సార్లయినను చల్లవలసియుండును. నారు నాటుటకు 30 రోజుల తరువాత 40 రోజుల లోపల మాత్రము అనుకూలముగ నుండును. ఈ నారు పెంపకము [illegible]గస్టు నెల మాత్రము మిక్కిలి వ్యయకరము. కాని [illegible]లిగిన అత్యంత లాభకరము.

[illegible] సాగుకు పునాసపంట పండించిన భూమియందు [illegible] తొలకరినుండి యేవిలి మాత్రము దున్నుచుండిన [illegible]యందుగాని పండించ వచ్చును. ఏవిలి దున్నిన భూమి [illegible] చేయుసాగు శ్రేష్ఠముగనుండును. ఈసాగుకు ఎ 1 కి [illegible]డ్ల పశువుల యెరువు, 2 బస్తాల వేరుసెనగ పిండి భూమిమీద చల్లి 5 చాళ్ళు వరకు దున్ని 45 సెం. మీ. దూరములో బోదెలుతోలి బోదెమీద 40 సెం. మీ. కు ఒక్కొక్క మొక్క చొప్పున నీరు పోసి నాటవలయును. దీని నింకను దూరపువరుసలలో నాటవచ్చునుగాని దూరముగ నాటిన కొలదిని పెద్ద పెద్ద దిమ్మలను కట్టును. పెద్ద దిమ్మలు మార్కెటులో ధర తక్కువగా పలుకును. అందువలన నేటీవల ఈ సాగు చేయు రైతులు ఒత్తుగా నాటి చిన్న గడ్డలను తయారు చేయుచున్నారు. మొత్తం ఎకరం దిగుబడిలో యేనాటుకైనను సమానముగానే పండుచున్నది. నారును ఉదయమే పీకి వేళ్ళకు మట్టి పోవునట్లు నీటిలో శుభ్రముగా గుంజి, డి. డి. టి. 50% మందు నీటిలో కలిపి ఆ నీటియందే నారును వేళ్ళతోసహా పూర్తిగ ముంచి చల్లని నీడ ప్రదేశమున వరుసగ నారును నిలబెట్టి సాయంత్రము మాత్రమే నాటవలయును. తరువాత రెండవ రోజునే

వాతావరణమును, మార్కెట్టు గిరాకినిబట్టి ఎ 1 కి 500 నుండి 1500 రూపాయలవరకు నికరలాభముండవచ్చును.

## కొత్తిమిరి

[illegible] ఈ పైరును ఆకుకూరలను పెంచి అమ్మెడివారు [illegible] సెంటుకు 3 శేర్లు వర్షఋతువునందును, 4 శేర్లు [illegible]కాలమునందును మడిమీద చల్లి పారతో 5 సెం. [illegible]తువరకు తిరగ్రదవ్వి చదరముచేసి నీళ్ళు పెట్టు[illegible] తరువాత మూడవరోజున మడిమీద తాటియాకు[illegible]ప్ప వేయుదురు. గింజలు చల్లిన వారమురోజులకు [illegible]లచిపోవును. మొలచిన వెంటనే మడిమీదనున్న ఆకు[illegible]లను తీసివేసి మడియందు పదునులేనిచో నీళ్ళు పెట్టుదురు. వర్షాకాలమందైన చిల్లుల డబ్బాలతో చల్లెదరు. ఈ సాగుకు జూన్ - జులై మాసములు అక్టోబరునుండి మార్చివరకు వాతావరణ మనుకూలముగ నుండును. ఆగస్టు, సెప్టెంబరు, ఏప్రిల్, మే నెల లీసాగుకు అనుకూలములు గావు.

కొత్తిమిరి పైరుకు విత్తులు చల్లిన 15 రోజులకు సెంటుకు 700 గ్రాములు అమోనియం సల్ఫేటును ఆకుల మీద పడకుండ చల్లి నీళ్ళుపెట్టిన యేపుగా పెరిగి తొందరలో కోతకు వచ్చును. ఈ సాగుచేయు మళ్ళను వేసవి గాడ్పులనుండి కాపాడుటకు మడికి పడమరవైపు తాటియాకులతో దడి కట్టవలయును. లేనిచో నీ పైరు వేసవి గాడ్పులకు తట్టుకొనలేదు. ఈ పైరు విత్తులుచల్లిన నెల నుండి పీకుట ప్రారంభించి తదుపరి 20 రోజులకు పూర్తిగా పీకి వేయవలయును.

## పుదీనా

దీనిని ఆకుకూరల విక్రేతలు సెంటుకు 1/4 బండి ఎరువు తోలి భూమిమీద చల్లి పారతో కలియతవ్వి 1 1/4 వెడల్పు 9 మీటర్లు పొడవుగల మళ్ళుకట్టి మళ్ళలో పెట్టి దంతితో చదరముచేసి ఆ బురదలోనే 10 సెం.మీ.ల పొడవుగల పుదీనా కాడలను 15 చదరములో ఒక్కొక్కటి చొప్పున నాటుదురు. నాలుగురోజులకు పులకతడి పెట్టెదరు. ఈ పైరు 2 లకుగాని పూర్తిగా నాటుకొనదు. నాటుకొనువరకు 4 లకు ఒకసారి నీళ్ళు పెట్టుచుండవలెను. నాటిన నెలరోజుల 1.5 కిలోల అమ్మోనియం సల్ఫేటు, 7 కిలోల వేరుసెనగపిండి మడిమీద చల్లి నీళ్ళు పెట్టుదురు. తర్వాత ప్రతి 20 రోజులకు ఒకసారి సెంటుకు 1.5 కిలోల అమ్మోనియం సల్ఫేటు వేయుచు వారమున కొకసారి నీళ్ళు పెట్టుచుండవలయును. మొక్క నాటిన 15 రోజులనుండి ప్రతివారము కలుపుతీయుటవసరము. దీనిని ప్రతి నెలకు ఒకకోత కోయవచ్చును. ఈ పైరును సంవత్సరమునుండి రెండు సంవత్సరములవరకు ఆ మడిలోనే పెంచవచ్చును. కాని రెండవ సంవత్సరము నిల్వయుంచుట లాభదాయకముగాదు. ఈ పైరు నాటుటకు జనవరి నెల అనుకూలము. దీనికి లద్దెపురుగు, జాసిడ్ దోమ, ఆకుముడత ఆశించును. ఈ తెగుళ్ళకు డి. డి. టి. 50%, బి. హెచ్. సి. 10% మందుల నుపయోగించవచ్చును.

## తియ్యకంద

కందసాగుకు 50 బండ్లు పశువుల యెరువు పరచి నాగలిచాళ్లు దుక్కిదున్ని జనవరినుండి మే చివరివరకు ...చ్చును. విత్తనము నాటుటకు 45 సెం.మీ. దూరము ...ళ్ళతోలి చాళ్ళలో నీరుపెట్టి ఒక్కొక్క కంద ...350 గ్రా. బరువుండునట్లు కోసి పైకి కనపడకుండా ...ంచవలయును. ఈ పద్ధతిన ఎ 1కి 10 పుట్లు కంద ...ము సరిపోవును. నాటిన 15 రోజులకు చాళ్లమధ్య ...తో పైపాటు చేయవలయును. ఈమధ్య కలుపున్న ...యించుచుండ వలయును. ఈపైరు నాటిన 20 రోజులకు మొలక ప్రారంభించి నెల 15 రోజులకు పూర్తిగ మొల కెత్తును. అమోనియం సల్ఫేటు నాటిన మూడవనెల ప్రారంభమందు 100 కిలోలు మరల నాల్గవనెల ప్రారంభ మందు 100 కిలోలు వేసి వర్షము లేనిచో నీళ్లు పెట్టవల యును. వర్షము కురియువరకు వారమున కొక తడి నీళ్లు పెట్టుచుండవలయును. కాని మే నెలలో మాత్రము నాలుగు రోజుల కొక తడి నీళ్లు పెట్టుటవసరము. జనవరిలో నాటిన పైరుకు నీళ్ళెక్కువసార్లు పెట్టవలసియుండును. మేలో నాటిన సాగుకు త్వరలో వర్షములు ప్రారంభించును కనుక నీళ్లు యెక్కువసార్లు పెట్టనక్కరలేదు. జనవరిలో నాటిన పంట మే నెలలో నాటిన పంటకంటె వెల యెక్కువ పలుకుచున్నది. ఆ తరుణములో (ఆగస్టు-సెప్టెంబరు) కూర గాయలు తక్కువగుటచే కంద దుంపలకు గిరాకి ఎక్కువగ

నుండును. జనవరినెల సాగుకు, మేనెల సాగుకు దుంపలో యూట తేడా కన్పించుటలేదు.

ఈ పంటకు బొబ్బ తెగులు తగులును. ఇది దు... త్రవ్విన తరువాత దుంపలమీద కనపడుచున్నది. ... తగిలిన దుంపలకు మార్కెట్టులో సరియైన ధర ... దీని నివారణకు ప్రత్యేకమైన మందులు క... అయితే కాండము పండబారగనే పైరునరికి ... త్రవ్విన ఈ తెగులాశించుటలేదు. పైరు పండబా... పోయిన తరువాత నిల్వయుంచి త్రవ్విన ... మాత్రమే కొన్నిటికి వచ్చుచున్నది. ఈ తెగులు ... దుంపలను విత్తనమున కుపయోగింపకూడదు. దుం... త్రవ్విన తరువాత నెలదినములు నిలువయుంచిన మీదటనే విత్తనమున కుపయోగపడును. కంద విత్తనపు దుంపలను నిల్వచేయుటకు గుంటను తీసి దుంపలకే మాత్రము దెబ్బ తగులకుండ జాగ్రత్తగా తెచ్చి గుంటలో పేర్చి పెట్టి దుంపలకు గాలి పారుటకు వీలుగా నుండునటు కప్ప వలయును.

## చిరుగడము

ఇటీవల నీ సాగుచేయు రైతులు పునాస పండించిన భూములలో దుక్కిదున్ని 45 సెం. మీ.ల కొక్కొక్క బోదె చొప్పున తోలి నీళ్ళు పెట్టి అడుగు పొడవు మూడు కణుపులుగల తీగ ముక్కలను కోసి బోదెలమీద, 2 కణుపులు భూమిలో నుండునట్లు 20 సెం. మీ. లకు

లేనియడల భూమిని నీటితో తడిపి విత్తనమును నాటి వారము రోజులకు పైపాటుచేసి మరల రెండవసారి నీళ్ళు పెట్టెదురు. కాని వర్షము అదనుకు కురిసి వేసి... శ్రేష్ఠముగా పెరుగుచున్నది. దీని సాగుకు కేవలవ గాక ముందొలకరికూడ యవసరము.

ఈ పైరు నెలరోజులకు పూర్తిగా మొ... నెల...కు భూమినంతయు పూర్తిగా కమ్ముకొను... కమ్ముకొను లోపల అవసరమునుబట్టి రెండు మూ... కలుపు తీయవలయును. రెండు నెలలు పూ... తరువాత ఊటమోసు వేయును. ఊటమోసు ప్రా... గనే 2 బస్తాలు వేరుసెనగపిండి, 50 కిలోలు అమోనియ సల్ఫేటు కలిపి చాళ్ళలో వేయుదురు. వర్షము లేనిచో నీళ్లు పెట్టుదురు. ఈ సాగుకు వర్షములు వెనుకబడిన తరువాత తోట బాగుగా వడబడువరకు నీళ్ళు పెట్టరు. తరువాత వర్షములు లేనిచో ప్రతి 15 రోజులకు నీళ్లు పెట్ట వలయును.

ఈ పంటను నాటిన 6 నెలల తరువాత త్రవ్వకొన వచ్చును. భూమిలో నిల్వయుంచదలచిన 15 రోజులకొక సారి నీరు పెట్టుచు, భూమిమీద పశువులు వగైరా తిరుగ కుండ మొలచిన మోసులను ఎప్పటికప్పుడు విరచివేయు చుండవలయును. ఈపద్ధతిలో ఆగస్టు నెలవరకు నిల్వయుంచ వచ్చును. కాని భూమిలో నిల్వయుంచినవి తొలకరించు లోపల త్రవ్వినవి మాత్రమే కూర కనుకూలముగ నుండును.

ఒక బండి యెరువుతోలి 60 సెం. మీ.ల దూరపు వరుస
లలో 45 సెం.మీ.లలోతు, 30 సెం. మీ. వెడల్పు గాడి
తీసి యెరువును గాడిలోవేసి మట్టితో మిశ్రమముచేసి —'
పూడ్చి మామూలు పద్ధతికంటె రెట్టింపుసైజు
దుంప ముక్కలను ఈయన నాటెను.

# 6 వ అనుబంధము

## అ ను క్ర మ ణి క